# తలనొప్పా?

# సారిడన్ 'రోష' వేసుకోండి

## నొప్పి మటుమాయమై...



## ...మీకు నవోత్సాహము కలుగుతుంది

**అదే సారిడన్ యొక్క ప్రత్యేకత!** నొప్పిని, దాని వలన కలిగే శ్రమను పోగొట్టుటయేగాక, హాయి నవోత్సాహములనుకూడ కలిగించుటకై సారిడన్ ఒక ప్రత్యేక సూత్రముతో తయారు చేయబడినది. దానిని వేసుకోగానే మీలో ఎంత మార్పు వస్తుంది! నొప్పి, శ్రమ మటుమాయమై, సరిగ్గా ఆలోచించ కలుగుతారు . పని యందు ఆసక్తి కలుగుతుంది . స్నేహితులతో సరదాగా వుండగలుగుతారు . . ఒకే ఒక సారిడన్ నొప్పిని పోగొట్టును, సేద దేర్చును, నవోత్సాహమును కలిగించును. ఎల్లప్పుడు సారిడన్‌ను మీ దగ్గర వుంచుకోండి. పిల్లలకు $\frac{1}{4}$ నుంచి $\frac{1}{2}$ బిళ్ల వరకు మాత్రమే చాలును.

VT. 5626 A




తలనొప్పి
పంటినొప్పి
ఒంటినొప్పి
బహిష్టునొప్పి

**ఒకే ఒక సారిడన్‌తో మటుమాయమవుతాయి!**

'రోష్' తయారు
ఏకైక డిస్ట్రిబ్యూటర్లు: 'వాల్టాస్ లిమిటెడ్

## క థ లు

ఆంధ్రపత్రిక వారపత్రిక ది 17—11—67 సంచికలో పెళ్లకూరు జయప్రదగారు వ్రాసిన "నీకీజన్మలో పెళ్లికాదు" అనే కథనిక చాలా బాగుంది ఈరోజులలో స్త్రీలుకూడా అలా వ ందుకు

# ఉత్తరాలు

వచ్చి మగవారికి తమమనస్తత్వము తెలిపి మగవారి అభిప్రాయాలు మనస్తత్వము తెలిసికొన్నతర్వాతనే పెళ్లిచేసికొనుట మంచిదని నాఅభిప్రాయము రచయిత్రిగారికి నాఅభినందనలు.

ఈసంచిక ముఖచిత్రం కూడా చాలా బాగుంది. శ్రీ శే శేషగిరిరావు గార్కి నా అభినందనలు.

-యం శ్రీనివాస్, (కొత్తగూడెంకాలరీస్)

* * *

17, నవంబరు 67 సంచికలో ప్రచురించిన జయప్రదగారు రచించిన "నీకీ జన్మలో పెళ్లికాదు" అనే కథ అద్భుతంగా వుంది.

ఎంత చదువుకున్న వాడైనా ఎంత సంస్కారవంతుడైనా 'గీత' వ్యక్తిత్వం గల స్త్రీని భరించడం కష్టం అని చాలా అందంగ చెప్పారు రచయిత్రి. ఆమెకు మా అభినందనలు తెలియజేస్తారు కదూ.

అదే సంచికలోని 31వ పేజీలోని బాబుగారి కార్టూను, ఫాలాక్షుడుగారి "అగ్గి పెట్టె గిగ్గి పెట్టె, లక్ష శిక్ష" చాలా నవ్వు పుట్టించేవిగా వున్నాయి.

శృంగారాన్ని వొలుకుతున్న 'రాధామాధవులు' ముఖచిత్రాన్ని అత్యంత రమణీయంగా రచించిన శేషగిరిరావు గారికి మా అభినందనలు!

అంగర వెంకట చిట్టి భారతి,
సుధ,
(విజయనగరం)

* * *

'విష్ణుమూర్తి ఎక్స్‌పెరిమెంటు' కథ చాలా బాగుంది కథ చిన్నదైనా తమాషాగా వుంది. బి. విజయలక్ష్మిగారు రాసిన ఈ కథ ఐదు నిముషాలపాటు నవ్వించక మానదు.

జి. యస్. ఆర్. ప్రసాద్, (విజయవాడ)

## వ్యా సా లు

శ్రీమతి పరిమళా సోమేశ్వర్‌గారు వ్రాసిన "కాలేజీల్లో సహవిద్య అవసరమా?" అనువ్యాసము చాలా బాగుంది. బాలికలు తమకట్టూ, బొట్టూగూర్చి గూడ కొంత స్వయంపరిశీలన చేసికొంటే మంచిదని వ్రాసారు. కాని నేటి బాలికలాగుణములను అనుసరించడం కల్ల.

—సింగం సూకరాజు (అనకాపల్లి)

## కా ర్టూ న్లు

13—10—67 సంచికలో నా విమర్శ విూద తణుకు ఎ రామమూర్తిగారి ప్రతివిమర్శ చదివాను వారు నవ్వెందుకు అలా విమర్శించారో నా కర్థం కాలేదు నేను ఉమెన్ కార్టూను అసభ్యంగా ఉందని విమర్శించాను గాని ఇండియా కమ్యూనిస్టు కూటమిలో చేరాలి రష్యా ఒక్కటే మన మిత్రదేశమని నేను అనలేదే?

మురళి, (ధవళేశ్వరం)

## ఒకవారం విపరీతం

"ఆంధ్రపత్రిక వారపత్రిక— ది 17 11 67 లో "ఒకవారం విపరీతం" శీర్షికలో మీరు ప్రచురించిన "అబ్బాయి అమ్మాయి" అనే వార్త చదివాను ఒకవేళ అబ్బాయి అమ్మాయిగా మారినా, అతని వయస్సెలా మారుతుంది? 19 ఏళ్లవాడు 23 ఏళ్ల స్త్రీగా మారడం అన్నది ఎంత అసమంజసంగా ఉందో ఆలోచించారా? ఈ రకమయిన వార్తలకు అసలు ఆధారాలు ఉన్నాయా? లేక ఊరికే తమాషాగా ప్రచురిస్తున్నారో తెలియ చేస్తారని నమ్ముతున్నాను

జి. ఆర్. మోహన్‌రావు (రాజమండ్రి)

* పందొమ్మిది సంవత్సరాల మగపిల్లవాడు ఆడపిల్లగా సంపూర్ణంగా మారడానికి నాలుగు సంవత్సరాలు పట్టి వుండచ్చుకదా! అప్పుడు '19 ఏళ్ల మగపిల్లాడు 23 ఏళ్ల ఆడపిల్లగా మారాడు' అనే వార్త రైటవ్వదూ ? మన సినిమాల్లో చూపేలాగ 'ఠం' అనే ఓ శబ్దంతో తప్పునాడపిల్లగా మారడం సాధ్యమా!!

— ఫాలాక్షుడు.

* * *

10—11—1967 ఆంధ్రపత్రిక వారపత్రికలో ఒకవారం విపరీతం శీర్షికలో వ్రాస్తూ, ఒరిస్సా ముఖ్యమంత్రిని శ్రీ ఆర్. యన్ సింగ్ డియో చేసేశారు! ఆయన పేరు సింగ్‌దేవ్ కాని సింగ్ డియోకాదు ఇంగ్లీషులో Deo దేవ్ అని చదవడం రైటు. ఇది మీయొక్క పొరపాటు

డా. డి జె. పాత్రో, (బరంపురం)

* * *

10—11—67 తేది వారపత్రిక చదివినతరువాత మీకీఉత్తరం వ్రాయకుండా ఉండలేకపోతున్నా.

ఎక్కడైనా ఏదైనా అలజడి జరిగిందంటే దానికి బాధ్యులు 'విద్యార్థులే' నన్న భావం అందరికి ప్రబలి పోయింది. పైగ విద్యార్థులే చేసినా 'ఏవిద్యార్థులు' అన్నదిముఖ్య తెల్సుకోకుండా విమర్శ చేయుట అంత సమంజసమైన పనికాదు.

'ఒకవారం విపరీతం'లో వ్రాస్తూ 'ఫాలాక్షుడు' గారు ఆంధ్రాయూనివర్సిటీ రిజిస్ట్రారు ఆఫీసులో తలుపులు పగులగొట్టి పెట్రోలు పోసి రికార్డులు అంటించారని వ్రాశారు. కానీ, ఆయనకి వచ్చిన వార్త నిజంకాదు. అలా రికార్డులు తగులబెట్టింది మిసెస్ ఏ వి ఎన్ కాలేజీ విద్యార్థులు ఇంకో సంగతి—ఆరోజున యూనివర్సిటీలో యూనివర్సిటీ విద్యార్థులెవ్వరూ లేరు (ఒకవారం శలవలకి ఇళ్ళకి వెళ్లారు) ఇది గమనించ ప్రార్థన ఈ ఉత్తరం ప్రచురిస్తారనుకుంటా

—కె ప్రభాకరరావు(ఎమ్ ఎస్ : ఫైనల్)
(విశాఖపట్టణం—1)

## సినిమా

ఈమధ్యకాలంలో కొన్ని పత్రికలలో "చిన్నారిమనసులు" అనే పేరును గూర్చి శ్రీమతి సావిత్రి మరికొందరు జర్నలిస్టు మిత్రులు ప్రకటించిన వార్తలు నా దృష్టికి వచ్చాయి "చిన్నారి మనసులు" నేను తియబోయిన్న చిత్రానికి ఉంచిన పేరు దానిని ఉపయోగించుకో వచ్చుని ఏ సంస్థకూ, వ్యక్తికీ సూచించలేదు నైతికంగా ఆ పేరు యిప్పటికి నా కథకే చెందుతుంది మరోరకంగా జరిగితే అవినీతి, అక్రమం అవుతుంది ఇంతకన్నా ప్రస్తుతం నేను చెప్పేదేమీలేదు.

ఆచార్య ఆత్రేయ, (మద్రాస్)

## కుటుంబ నియంత్రణ

మీరీమధ్య ప్రకటించిన కుటుంబ నియంత్రణ వ్యాసాలు బాగున్నవి. నేడు జనాభా అత్యంతశీఘ్రగతితో పెరిగి పోతున్న ఈ తరుణంలో మీరు

# ఉత్తరాలు

యిలాంటి వ్యాసాలు ప్రచురించుట హర్షనీయమైనది

కాని కొందరు చదువుకొన్న యువతులుకూడ ఈ వ్యాస రచనల పోటీని జుగుప్స చేయటం స్వయంగా చూశాను దీనిని చాలా సిగ్గుపడవలసిన విషయంగా కూడా వాళ్లు పరిగణించారు వాళ్ళకు నా మనవి ఏమిటంటే 'యిప్పటి సమస్యనుయిప్పటి దృష్టితో జూసి దానికి తరుణోపాయం కనుక్కోవాలి అందరూ దానిని ఆచరించాలి ఈనాటి సమస్యను మన బామ్మల అవ్వల దృష్టితో చూసి యిదేదో చేయరాని అపరాధం అనుకోవటం చాలా విచారించవలసిన సంగతి దానిని గూర్చి కొందరు తప్పుడు ప్రచారం కూడా చేస్తున్నారు.

ప్రభుత్వం ప్రజలకు సరిగా తిండిపెట్టలేక కుటుంబ నియంత్రణ అని అంటున్నారని యిటీవల ఒకానొక రాజకీయ పక్షీయులు అన్నట్లుగా దినపత్రికలో చదివాను అది కేవలం బాధ్యతలేని మాటగా స్పష్టంగా తెలుస్తోంది ఇలాంటి క్లిష్ట సమస్యలయందు ఏపార్టీ వారైనా పార్టీ విభేదాలు మరచి, వాస్తవిక దృష్టిలో చూడాలి

దీనివలన కొన్నాళ్ళకు హిందూమతమే నశించి పోతుందని కొందరు మతాధికారులంటున్నారు మత సంబంధమైన గొడవలు జాతి భద్రతకే చాలా ముప్పు కాబట్టి ప్రభుత్వం వారు దీనిని దూరదృష్టితో వ్యవహరించి వెంటనే పరిష్కరించాలి పోయిన కొద్ది జటిలమవుతుంది సమస్య

'కుటుంబ నియంత్రణ'వలన యువతీయువకుల నైతిక విలువలు కొంతవరకు దిగజారుతున్నాయని ఒప్పుకొనక మానదు 'కుటుంబనియంత్రణ' శిబిరానికి (ప్రైవేటు డాక్టర్ల దగ్గర కంటెనా సరే!)

వచ్చిన యువతి, యువకులను మొదటివారు వివాహితులా, అవివాహితులా అనే విషయాన్ని గమనించాలి అవివాహితులకు అచట తావులేకుండా చేయవలసిన అవసరం కూడా ప్రభుత్వానికి వున్నది

కుటుంబ నియంత్రణను సక్రమంగా అమలు జరపవలసిన బాధ్యతతోబాటు యువతీ యువకుల నైతిక విలువలు దిగజారకుండా చూడవలసిన బాధ్యత కూడా వున్నది

ఈ వ్యాసాలు వ్రాసిన రచయిత్రిలకు నా ధన్యవాదాలు అన్నీ చదవాక నా అభిప్రాయాలుకూడా తెలుపలేకుండా వుండలేకపోయాను

—ప్రమద (గుడివాడ)

## న్యూఢిల్లీ లేఖ

శ్రీ కృష్ణగారి న్యూఢిల్లీ లేఖ అత్యంతానందాన్ని కల్గించింది 'ప్రజల ఖర్చుతో మంత్రుల ప్రపంచ యాత్ర' అని ధైర్యంగా చెప్పారు శ్రీకృష్ణలాటి సద్విమర్శకులు వుండడం వల్లనే నేడు భారత దేశంలో ఈమాత్రమైనా ప్రజా స్వామ్యం నిలచి వుంది మంత్రుల విదేశ యాత్రలను గురించి వార్తాపత్రికలలో కనిపించేసరిక్కి, 'విదేశయాత్రల కోసమే మంత్రులవుతున్నారా' అనే సందేహం కల్గుతుంది ఇంకా శ్రీకృష్ణగారు అక్షరలక్షలు విలువ చేసే మాటలు, "శ్రీమతి గాంధి వేశంలో చేరి ప్రపంచ యాత్ర చేయండి!" అన్నారు వారినెంతో అభినందిస్తున్నాను

—మహాభాష్యం నరసింహారావు, (హిరమండలం)

* * *

ఈవారం న్యూఢిల్లీ లేఖ సహజంగా వున్నది శ్రీకృష్ణగారు వున్నది స్పష్టంగా తెలుపుతున్నారు వారిని మెచ్చుకోవలసిందే 'ఏమైంది నాకు' అను కథ ద్వారా ప్రతి ఒక్కరికి సంసారమనేది విధిగా వుండవలసిందే అని తెలుసుకోవచ్చు

ఎస్ నరసింహారావ్, (తిరుమల)

## సీరియల్

సి(మా) పత్రికలో ప్రచురించిన "పూర్వాసంధ్యా ప్రవర్తతే' నవల చాల బాగుంది శ్రీమతి తేజోవతిగారు "జ్యోతి, రమణలద్వారా మిత్రత్వమును" "ఆనందరావు, వెంకటరావులద్వార పల్లెటూళ్లల్లో జరుగు రాజకీయములను "శంకరం మాస్టారిద్వారా ఉపాధ్యాయుని విధి నిర్వహణం, కార్యకుశలతను" వరదరాజులు గారి ద్వార అసూయ, ద్వేషమును"

# ఉత్తరాలు

వేణుగోపాల్ ద్వారా ఇచ్చిన మాట నిలుపుకొను ప్రజ్ఞను" "సుశీలద్వారా అమాయకతను" ఉపద్వార స్త్రీ విద్యను పూర్వాసంధ్యా ప్రవర్తతే ద్వారమాకు ఇంలటి చక్కటి పాత్రలను పోషించి నవలనురచించిన "శ్రీమతి తేజోవతి"గారికి నాహృదయపూర్వక కృతజ్ఞతాభి వందనములు

—ఓగిరాల దుర్గామహాలక్ష్మి (చినఓగిరాల)

## చిత్ర సమీక్ష

22—12—67 సంచికలో సికరాజుగారి చిత్ర సమీక్ష 'పూలరంగడు' గురించి చదివాను. చదివాక నా అభిప్రాయం వ్రాయాలనిపించింది, వ్రాస్తున్నాను. సికరాజుగారు 'పూలరంగడు' చిత్రకథ గురించి వ్రాస్తూ రంగడు జైల్లో ఉన్న తన తండ్రిని కల్సుకోవడానికి సర్పును చావగొట్టి జైలుకు వెళ్ళాడని వ్రాసారు. వారు పిక్చరును సరిగా అర్థంచేసుకోలేదేమోనని అనుకొంటున్నాను ఎందువలన అంటే రంగడు తన చెల్లెలు కాపురంలో నరును చిచ్చుపెట్టాడని తెల్సి చావగొట్టిన నేరానికి రంగడ్ని జైలులో పెట్టారు. తన తండ్రి అదే జైలులో వున్నాడన్న సంగతి రంగడికి అప్పటికి తెలియదు తరువాత తెలుస్తుంది. ఈ విషయంలో సికరాజుగారు నాతో ఏకీభవిస్తారని తలుస్తాను.

తాడూరి వెంకటరమణారావు (అనకాపల్లి)

* రంగడు తండ్రిని జెయిల్లో కలుసుకోవడం సంఘటన సహజత్వానికి కొంచెం దూరంగా వుందని పరీక్షకుడు అభిప్రాయపడ్డాడు. అలా సినిమాల్లో మాత్రమే తటస్థపడుతుందని సమీక్షకుడి భావం. ఈ భావాన్ని తిప్పి చెబుతూ 'తండ్రిని కలుసుకోవడంకోసం సరును చితకతన్నుతాడు రంగడు!' అని రాశాను. ఇక్కడ మరో విషయాన్ని పాఠకుడి దృష్టికి తెస్తున్నాను. 'ధర్మారావుకి చలపతికి మధ్య వచ్చు గడ్డివేసి భగ్గుమనిపిస్తాడు' అని కూడా రాశాను. అంతమాత్రంచేత రంగడు నిజంగా వచ్చు గడ్డి వేశాడనా? పాఠకుడు గ్రహిస్తారని ఆశిస్తున్నాను. —సికరాజు.




# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం: 29—12—'67

శ్రీప్లవంగనామ సం॥ మార్గశిర్షమాసం బ॥ త్ర...

సంపుటము : 60 సంచిక : *17*

స్థాపితము:

1908

ముఖ్య సంపాదకుడు :

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము

1, తంబుచెట్టి వీథి, మద్రాసు-1

పోస్టుద్వారా (1—1—1968 నుండి)

| | |
|---|---|
| సంవత్సర చందా | 26 00 |
| 6 మాసముల చందా | 13 00 |
| 3 మాసముల చందా | 6.50 |


## విషయానుక్రమణిక

ముఖచిత్రం శైలశ్రీ

(ఫొటో: ప్రభాకర్)



పనికిమాలిన పాతదారి
భారతక రాజ్యానికి సహకారం
అబ్దుల్లా ప్రయాణం:
షేక్ అబ్దుల్లా
అప్పును ఆరిగ్గె ఇవ్వాలనప్పుడు
అజయ్ ముఖర్జీ
మెద్దు వారి గుఱ్ఱం
నాయకత్వం
కమ్యూనిస్టు పార్టీలు

# గోడమీద పిల్లి వాటంగా తప్పుకుంటున్న మంత్రులు: హిందీ భాషోన్మత్తత దేశానికి అరిష్టం

'మేము విడివిడిగా నిలబడ్డాం, కట్టగట్టుకు పడిపోతాం' అనేది దక్షిణాదివారి నినాదం: ఆంధ్రప్రదేశ్, మైసూరుముఖ్యమంత్రుల వైఖరి వల్ల ఇది సుస్పష్టంగా తెలుస్తోంది. అఖిలభారతదేశానికి హిందీ అధికార భాషగా అంగీకరిస్తామని వారనలేదుగాని, అందుకు సుముఖంగా వున్నట్టు మాత్రం వ్యక్తపరచడం జరిగింది

శ్రీ నిజలింగప్పగారు కాంగ్రెసు అధ్యక్షుడు కాకముందు, ఆయన మైసూరు ముఖ్యమంత్రిగా తమ అభిప్రాయాన్ని సెలవిచ్చారు. ఇప్పుడు మైసూరు రాష్ట్ర రాజకీయాల బాధ్యతని వారసుడి నెత్తిమీద పెట్టి తాము ఉన్నత సింహాసన మెక్కారు. అఖిలభారత కాంగ్రెసు కమిటీ యాజమాన్యమంతా హిందీవారిదే కాంగ్రెసు అధ్యక్షుడుగా రావాలని అభిలషించారు గనక, ఆయన హిందీని సమర్థించడంలో అర్థం లేకపోలేదు! ఒకవేళ హిందీయేతర రాష్ట్రాల మీద హిందీని రుద్దినప్పుడు దాని పరిణామంగా బాధపడేది ఆయన వారసుడు. మెప్పుకోలుకోసం ఆశించారేగాని, తర్వాత పరిస్థితులు ఎలా వుంటాయో, అని ఆయన ఆలోచించలేదు. మైసూరువాసులు అనేక మంది మైసూరును దాటి పని చేసుకుంటున్నారు. వారికి ఎలాంటి కీడు జరిగినా అది నిజలింగప్పగారికి అవసరంలేదు!

హిందీ భాషావాదంలో శ్రీ బ్రహ్మానంద రెడ్డిగారి వైఖరికూడా అలానేవుంది. రెండు వందల సంవత్సరాలనుంచి ఉర్దూ నైజాం రాజ్యంలో స్థానం ఆక్రమించుకుంది ఆ భాష రాష్ట్ర వ్యాప్తంగా వినిపిస్తూ వుంది అని వారు తప్పించుకోవడానికి అవకాశం వుంది. ఇక్కడ ఒక విషయం రూఢిగా తెలుసుకోవాలి సాంస్కృతికంగా ఆలోచిస్తే, ఉర్దూకి హిందీకి ఎక్కడా పోలిక కనిపించదు ఉత్తరప్రదేశ్, ఢిల్లీ, పంజాబు రాష్ట్రాల్లో ఉర్దూ అధికారభాష. హిందీ అని మాత్రం వారు చెప్పరు. నిజాం రాజ్యంలో ఉర్దూ అధికారభాషగా వుండేది. అది ఉస్మానియా విశ్వవిద్యాలయంలో బోధనా భాషగా కూడా వుంటుండేది. ఇది ఇరవై ఏళ్ళక్రితం మాట ఇప్పుడు పరిస్థితులు మారాయి కేంద్రం ఉద్యోగాల్లో ఆంధ్రులకి చాలతక్కువ కేటాయింపు వుంది అందుచేత హిందీని ప్రవేశపెట్టినా, వారికి ఆర్థికంగా ఏమంత నష్టం కలగకపోవచ్చు. —ఇటువంటి వాదనతో సరిపుచ్చుకుంటే అది సబబు కాదు.

### ఇంగ్లీషును అలక్ష్యం చేస్తే భారత విద్యార్థుల భవిష్యత్తు?

ముఖ్యంగా రెడ్డిగారు ఆలోచించవలసిన విషయం మరొకటుంది. ప్రస్తుత ప్రపంచంలో సయింటిఫిక్, టెక్నికల్ విద్యలకి ఎక్కువ భవిష్యత్తు వుందని తెలియనివారుండరు ఆయా విద్యల్లో తమ రాష్ట్ర ప్రజలు ప్రజ్ఞావంతులు కావాలంటే ఏది ముఖ్యమో దానిని త్రుంచి పారేయడం మంచిదికాదు మరో అంశంవుంది ఆంధ్రులు ప్రాంతీయవ్యాపారాన్నే కోరుకుంటే సరే సరి లేదా, బయటి ప్రపంచంతో వ్యాపారం చేయాలంటే వారికి ఇంగ్లీషు చాలాముఖ్యం. మెస్సర్స్ మొరార్జీ దేశాయ్ అండ్ కంపెనీ (అన్ లిమిటెడ్) వారి ధర్మమా అని బ్రిటిషు, అమెరికన్ విశ్వవిద్యాలయాల్లో గుజరాతీవారి యోగ్యతని నిమ్నతరగతిలో జమ కట్టడం జరుగుతున్నది. అందుకు ముఖ్యమైన కారణం, వారికి ఇంగ్లీషులో అంతగా ప్రవేశం లేకపోవడమే. ఆంధ్రులు కూడా గుజరాతీలతో సమవుజ్జీగా వుండాలని శ్రీయుత రెడ్డిగారు కోరుకొంటున్నారా?

ఇది అలావుండగా, దక్షిణాదిన 'యునయ్టెడ్ ఫ్రంట్' గురించిన పెద్ద సమస్య మరొకటున్నది నిజలింగప్పగారుగాని, బ్రహ్మానందరెడ్డిగారుగాని హిందీయేతర రాష్ట్రాల్లో హిందీ భాషోన్మత్తులు ప్రవేశపెట్టిన ఈ యునయ్టెడ్ ఫ్రంట్‌ని గుర్తించినట్టు లేదు విద్యార్థులు పార్టీల రాజకీయపు బెత్తుగడలకి పరికరాలుగా తయారయ్యారు! ఉత్తరప్రదేశ్‌లో భాషా బిల్లుమీద విద్యార్థులు పెద్ద ఎత్తున ఆందోళన లేవదీశారు. భారతదేశం మీద విద్యార్థుల ప్రభావం ఎంతగావుంటుందీ అనే విషయాన్ని వారు రుచి చూపించారు.

### ఐక్యమత్యాన్ని ముక్కలు చేస్తున్న హిందీ భాష:

ఈ హిందీ వాదమే దేశాన్ని తునాతునకలు చేసింది భారతదేశం విడిపోడానికి దక్షిణదేశం ఏమాత్రమూ కారణం కాదు. హిందీవారే అందుకు కారణం పంజాబును పంజాబు, హార్యానా రాష్ట్రాలుగా విడదీయడానికి కారణం హిందీ. ఈ హిందీ భాషోన్మత్తత భారతదేశాన్ని విచ్ఛిన్నం చేస్తుందనడంలో కొత్త ఏమీ వుండదు

మహారాష్ట్రలో గోవాను కలపకుండా చేయడానికి 'మద్యనిషేధం' ప్రధాపాత్ర వహించింది అలానే ఈ హిందీవాదం—నాగా, కాశ్మీరు సమస్యల్ని పరిష్కరించడానికి కొరకరాని కొయ్యగా తయారవుతుంది. నాగాలు ఇంగ్లీషును ఆమోదించారు. కాశ్మీర్ ముసల్మానులచేత ఉర్దూను విసర్జింపజేయడానికి ఘనత వహించిన గోవింద్‌దాసుగారి తలప్రాణం తోకకి వస్తోంది!

వయోజనస్వాతంత్ర్యఫలంగా వెనకబడిన రాష్ట్రాలవారు భారతదేశపరిపాలన సాగిస్తున్నారు ఇదొక విచారకరమైన విషయం! అలహాబాద్, లక్నోల్లానే (అలహాబాదుని రాజ

ధానిగాచేసి దానికి ప్రఖ్యాతి తీసుకువచ్చింది బ్రిటిషువారు. లక్నో సంస్కృతి సభ్యతలు హిందీనుంచి రాలేదు ఇస్లామీ వల్ల వచ్చాయి) ఉత్తరప్రదేశ్ కూడా ఒక వెనకబడిన రాష్ట్రం! కాశీ హైందవతకి ప్రతీకగా నిలబడి వుంది కాశీలో వున్నవారికంటె మధురైలో వున్నవారికి ఎక్కువ సంస్కృతం వచ్చునని చాలమంది ఒప్పుకున్నారు

### దక్షిణాదివారికి దారిచూపిస్తున్న తమిళనాడు

ఇదివరలో మనం చెప్పుకున్నట్లుగానే మన పరిపాలకులు తమతమ బిడ్డల్ని పక్కా ఇంగ్లీషు పాఠశాలల్లోనే చదివిస్తున్నారు. శ్రీమతి గాంధీగారి స్వంత కుమారులు బ్రిటిషు విశ్వవిద్యాలయంలో చదువుతున్నారు పెద్దపెద్ద ఉద్యోగాలని తమ వారసులకోసం ఏర్పరచుకోవడం మన స్వతంత్ర భారతదేశ చరిత్రలో మామూలే! ఇప్పుడు హిందీమిషతో వాటిని మనవారు భద్రపరచుకుంటున్నారు ఇవి, వారికిమాత్రమే ప్రత్యేకం!

సిసలైనమాట చెప్పుకోవాలంటే, తమిళనాడు ఒక్కటే హిందీని తీవ్రంగా నిరసిస్తున్నది. తమిళనాడు సంపాయించిన విజయాన్ని బెంగాల్, కేరళ, మైసూరు, ఆంధ్ర రాష్ట్రాలు పంచుకుంటాయి!

దేశీయాంగమంత్రి చవాన్‌గారు అన్న మాట నిలబెట్టుకున్నారు. ఉత్తరప్రదేశ్‌లో విద్యార్థుల అల్లర్లని, కాంగ్రెసుపార్టీలో సేట్ గోవిందదాస్ అండ్ కంపెనీ ఆదర్శాన్ని పెడచెవిని పెడుతూ ఇప్పటి పార్లమెంటు సమావేశంలో భాషా బిల్లును ప్రధానమైనదానిగా చేశారు వాయిదా కుదరదంటే అలా వుండాలి అనిపించుకున్నారు!

### అభివృద్ధి సంఘం— డా. డి. ఆర్. గాడ్గిల్ సూక్తులు

'భారత అభివృద్ధిసంఘం' కృషిని పునర్‌వ్యవస్థీకరిస్తూ, డా. డి. ఆర్. గాడ్గిల్ కొన్ని మంచిమంచి సలహాలని ఇచ్చారు ధరల స్థిరీకరణకోసం ఆహారధాన్యాల విల్వలే కాకుండా ప్రత్తి, జనపనార, పంచదార, వేరుసెనగనూనె విల్వలు కూడా అవసరం అన్నారు. 'అయితే గియితే' అనకుండా

(13 వ పేజీ చూడండి)










—క్రెబ్ తన కత్తిని జోరుగా ఉపయోగించాడు. న్యూస్‌ప్రింటు చుట్టలు కట్టిన తాళ్ళమీద.

(—దీంతో బాండ్ పని ఆఖరు!)









క్రెబ్స్ తిరిగి కారు మీదకి దూకటానికని డ్రాక్స్ కారుని లారీ పక్కకి లాగాడు.

ఎస్ ఆకారం మలుపు తిరగగానే ఊడిపడిపోయిన ఒకచుట్ట నావైపుకి దొర్లుకుని రావటం చూశాను.










ఆ పెద్ద చుట్టని తప్పించుకోలేక పోయాను..

నా కారు క్రాష్ అవుతున్నప్పుడు అనిపించింది. నా తుపాకి అనవసరం కదా అని. ఇంతలో కారులో నుంచి విసురుగా బయటపడ్డాను.










డ్రాక్స్ తన కారుని వెనక్కి తిప్పాడు కాగితం చుట్టల తమాషా అయిన తర్వాత కూడా నన్ను వదులుకో తలచలేదు.

—తొందరగా క్రెబ్స్! ఈ కారు భీభత్సం ఎవరైనా గమనించే ముందే అతన్ని మన కారులో పడెయ్యాలి

గాలాతో బాటు నన్ను వెనక సీటులో పడేశారు ముందు నాకాళ్లు కట్టేసి నాకు స్పృహలేదు










డ్రాక్స్ మెర్సిడెస్‌లో నాకు తెలివి వచ్చింది పక్కనే గాలా ఉండటం గమనించాను పోనీ ప్రాణాలతో ఉన్నాను.

మెర్సిడెస్ ముందుకి దూసుకుపోతోంది గాలా తను కనుక్కున్న సంగతిని నా చెవిలో ఊదేసింది— డ్రాక్స్ రాకెట్‌తో లండన్‌ని ఎలా నాశనం చెయ్యదలుచుకున్నాడో

— అక్కడికి వచ్చేసాం క్రెబ్స్.










డ్రాక్స్ కాంటర్బరీలో నుంచి వెళ్లాడు. ఊరు నిద్రలో మునిగి ఉంది.

—సారీ గాలా! కాని, నేను బయటికి దూకెయ్యటానికి ప్రయత్నించబోతున్నాను.

కాని క్రెబ్స్ వదల్లేదు— తిరిగి తెలివి తప్పింది నాకు

—కుక్కా, వెనక్కి పో!

(ఇంకా ఉంది)

# కలంమీద ఇంగ్లీషులో పేరూ-కత్తిపోటూ

తన పెన్ను మీద ఇంగ్లీషులో చెక్కించుకున్న పేరు చెప్పడానికి నిరాకరించాడని బాలియా కాలేజీలో ఒక విద్యార్థిని మరొక విద్యార్థి కత్తితో పొడిచాడు. ఇది డిశంబరు 9న జరిగింది.

## ముప్ఫయివేల రూపాయల తివాసీ

ఒకానొక మంత్రి (?) తన యింట్లో 30 వేల రూపాయలు ఖరీదు చేసే తివాచీ వేయించాలని అన్నారనీ, మంత్రుల యిళ్ళకు బాగులు, తదితర ఖర్చులకు 10 లక్షల రూపాయలు వ్యయమయ్యాయనీ ఈవిషయం నిజమేనా అని శ్రీ ఏ. యం. తరీక్ మొన్న ఏడవ తేదీన రాజ్యసభలో 'ఆకాశ' మంత్రిని ప్రశ్నించారు—నిప్పు లేందే పొగ రాదుగా? స్వాభిమానం దేశసేవ వుండటమా.



## గుండె మార్పిడి

కేప్‌టవున్‌లో 'గ్రూట్స్‌ష్యూర్' ఆసుపత్రిలో డాక్టర్లంతా చేరి లూయిస్ వాష్‌కాన్‌స్కీ అనే కిరాణా వ్యాపారికి గుండెదానం చేసి, ప్రాణదానం చేశారు. గుండెజబ్బుతో ఆయన ఆసుపత్రిలో చేరాడు. ఏక్షణానైనా పనిచేయటం ఆగిపోయే గుండెకారణంగా "ఇదిలేని, అదిలేని" అని డాక్టర్లు ఎదురుచూస్తున్నారట. అంతలో రోడ్డు ప్రమాదంలో ఒక 24 ఏళ్ళ అమ్మాయి చనిపోయిందట. ఆమె గుండెతీసి, ఇతనికి పెట్టి, ఆపరేషన్ జయప్రదంగా ముగించారట. ప్రపంచ చరిత్రలోనే గుండెమార్పు ప్రథమంగా జరిగిందని ఆసుపత్రికి చెందిన సూపరింటెండెంట్ అన్నారు. కానీ, ఎదురు తెచ్చుకున్న గుండెకాయతో చాలాకాలం బతకడం కష్టమేనీ, అసాధ్యమనీ [illegible] 'హార్ట్ స్పెషలిస్టులు' [illegible]

బెల్జియంలో రెన్నాళ్ల క్రితం ఒక ఆవుదూడకు ఎంలో ఒవుదూడ గుండెకాయ పెట్టి బతికించారట. ఆ దూడ యిరవైనాలుగువ చనిపోయిందట గుండె మార్పుతో బతికిన జీవరాసుల్లో యిదా ఆవుదూడే ప్రథమం అని అన్నారు.

* * *

అర్ధరాత్రి ఢిల్లీలో ఒకరోడ్డు మీదపోతున్న మిలటరీ ఆఫీసరు ఒకాయన— రోడ్డు ప్రక్క రక్తపు మడుగులో స్పృహతప్పి పడున్న వో వ్యక్తిని చూసి ఆగారట. స్కూటరు శైసప్పు పగ్గాలు చూసి, ఆ వ్యక్తి యూనిఫామ్ లా మినిష్టరు కుమారుడనీ తేలిందట పోలీసు కథనం ప్రకారం అతని స్కూటరు పేవ్‌మెంటుకు ఢీకొని ప్రమాదం జరిగిందట. ఆసుపత్రిలో చేర్చిన వో గంటకు అతను చనిపోయాడట

## పద్మభూషణ్ వాపస్

'నాకు 1961 లో ప్రభుత్వం యిచ్చిన పద్మభూషణ్ బిరుదు తిరిగి ప్రభుత్వానికే యిచ్చేస్తాను" అని హిందీ పండితుడు శ్రీ సుమిత్రానందన్‌పంత్ అన్నారట. భాషా చట్టానికి తన అసమ్మతిని ఆ రకంగా ఆయన తెలియజేస్తారట ఈ భాషా సమస్యే ఏ దేశంలో విప్లవానికి నాంది అవుతుందో?

## తురాయా - కుటుంబనియంత్రణా

యిస్పెషల్ చదువుతున్న కుర్రాడొకడు షోలాపూర్‌లో ఒక ఆసుపత్రిలో వేసెక్టమీ(కుటుంబ నియంత్రణ ఆపరేషన్) చేయించుకున్నందుకు అరెస్టు చేశారట.



## నదిలోకి బస్సుప్రయాణం

వియన్నాకి 150 మైళ్ళ దూరంలో వున్న కినిస్టార్ ప్రాంతంలో 21 మందితో వెళ్ళుతున్న ప్రయాణీకుల బస్సొకటి ప్రమాదవశాత్తూ సరోనిక్ నది లోకి దొర్లిపోయిందట ఇది డిశంబరు [illegible] జరిగింది

## తల్లీ కూతుళ్ళు- వ్యభిచారం-మద్యం

మద్రాసు మైలాపూరులో డిశంబరు 11వ రాత్రి 12 గం లకు పోలీసులు ఒక యింటి మీద దాడిచేసి, యిద్దరు స్త్రీలను, కొంతమంది పురుషులను వ్యభిచార చట్టం క్రింద, మద్యనిషేధం చట్టం క్రింద అరెస్టు చేశారు వారి యింట్లో బ్రాంది విస్కీ వంటి మద్యపానాలు దొరికాయట స్త్రీలిద్దరూ తల్లీకూతుళ్ళట.

* * *

జయపూర్‌లో లారీ ఒకటి దారినపోయే రిక్షాను ఢీకొందట రిక్షాలో వున్న ముగ్గురు వ్యక్తులలోనూ యిద్దరూ ఆ లారీ చక్రాల క్రిందపడి అక్కడే చనిపోయారట. స్వల్పగాయాలతో బయటపడిన ఆ వ్యక్తి యిద్దరు పిల్లల తల్లట—తన యిద్దరు పిల్లల అకాల మరణం చూడడానికి ఆ తల్లి బతికి బయటపడింది. ఈ విషాదం ఆరున జరిగింది

మోటారు సైకిళ్ల మీద వెళ్లేవారు యినుప టోపీలు ధరించాలి అన్న చట్టం కేవలం డి యం కే. వారు స్వలాభంతో పెట్టారనీ, ఆ టోపీలు చేసే కంపెనీతో పబ్లిక్‌వర్క్సు మంత్రి శ్రీ కరుణానిధికి లాబూచీ వుందనీ—నవశక్తి అనే తమిళ దినపత్రికలో కన్నదాసన్ అనే ఆయన రాశారు ఈ విషయం కోర్టు వరకూ వెళ్ళింది. ఆ చట్టం కాంగ్రెసు ప్రభుత్వమే పెట్టినట్టూ, తనకీ చట్టానికిగని, టోపీల కంపెనీకిగనీ సంబంధం లేనట్టు శ్రీ కరుణానిధి కోర్టులో నిరూపిస్తూ, "కన్నదాసన్‌కి నా మీద వ్యక్తిగత ద్వేషం, పగ వున్నాయి." అన్నారు. వ్ప ఏమిటో. పొలిటిక్స్ అన్న మాటకి అర్థం మారాలి యింక.

## చావెక్కడో—
## పుట్టుకెక్కడో

విజయవాడ సమీపంలో వున్న ఎనికేపాడు వద్ద జరిగిన కారు ప్రమాదంలో చనిపోయిన స్త్రీపురుషు లిద్దరూ విదేశీయులేనట. వారిద్దరూ ఎక్కిన కారు ఒక వేప చెట్టుకు గుద్దుకోడం వల్ల ప్రమాదం సంభవించి, ఇద్దరూ అక్కడే మరణించారట. ఆస్ట్రేలియా నుంచి వచ్చి ఎనికేపాడులో ప్రాణాలు పోగొట్టుకొన్నారు. నుదుటి మీద రాత ఎలా వుందో అలా జరగాల్సిందే కదా పాపం ..

* * *

కలకత్తాలో వున్నట్టుండి ఒక యింట్లో ప్రేలి ఒకవ్యక్తి చనిపోయాడట. మరొకతను గాయ పడ్డాడట. పోలీసులు ఆ యింటిని సోదాచేస్తే



బాంబులు తయారు చేసే ముడిసరుకులు దొరికాయట. ఈ విద్రోహక చర్య ఏ కొంపలు కూల్చడానికో—

## భూకంపాలు

భూకంపాలు మన దేశానికి తరుచు వచ్చి పోతున్నాయి. మహారాష్ట్రంలో సంభవించిన భూకంపం హిందూదేశ చరిత్రలోనే ఒక స్థానాన్ని ఆక్రమించింది. 'కొయినానగర్' అనే వూరు సర్వనాశనం అయ్యింది. 80 శాతం యిళ్ళు పడిపోయాయని నూటయాభై మందికి పైగా చనిపోయారనీ 1600 మందికి పైగా దెబ్బలు తగిలాయనీ, నిరాశ్రయులైన వారు లెక్కకు మీరారనీ లెక్కలు కట్టారు. లెక్కకు తేలని చావులెన్నో..

—పొలాటుడు

# రాకుమారుల

# కాలి బంతిఆట

లండన్‌లో ఫుట్‌బాల్ ఆట నేర్పే పాఠశాల ఒకటుంది అక్కడికి అనేక మంది బాలబాలికలు ఆ బంతి ఆట నేర్చుకోవడానికి వస్తుంటారు అందులో పెద్ద చిన్న కుటుంబాలు తారతమ్యం వుండదు. పిల్లలంతా కలిసి కట్టుగా ఆడుకుంటారు



'నీకసలు బంతాట చేతకాదు... పిక్కలుకొచ్చేశావ్'

ఆ జట్టులో రాణీగారబ్బాయి ఆండ్రూ రాకుమారుడు కూడా వున్నాడు (అందరూ వున్న బొమ్మలో చేతులు నడుముమీద పెట్టుకు నుంచున్నాడు) అతను సంవత్సరం బట్టి బంతిఆట నేర్చుకుంటూ ఆటలో కొంత ప్రవేశం సంపాయించాడు.

మార్గరెట్ రాకుమారిగారబ్బాయి విస్కౌంట్ లయిన్లీ ఆరేళ్లవాడు అతనూ బంతిఆట నేర్చుకోవడానికి వచ్చాడు (ఫొటోలో ఆండ్రూ వెనక వెక్కిరింతగా నుంచున్నాడు)

విస్కౌంట్‌లయిన్లీ భలే తమాషా పిల్లవాడు [illegible] ప్రతి [illegible]



పుష్ బంతాటకూడా ఒక ఆటేనా పుత్తి చిన్నపిల్లలఆట

తనదే పై చెయ్యి అంటాడు అంతా తనకే తెలుసంటాడు ఎంతయినా యువరాణీగారబ్బాయి కదా!

సరే అందరి పిల్లల్లానే వారికీ ఆట ఆడేవంతు వచ్చింది పిల్లలంతా యిష్టం వచ్చినట్టు ఆడుకోవడం మొదలెట్టారు ఆ అవకాశం తీసుకుని లయిన్లీ మరీ చిలిపి పనులు చేయడం ప్రారంభించాడు ఆండ్రూ దగ్గర్నుంచి బలవంతంగా బంతి లాక్కుందామని ప్రయత్నించాడు

దగ్గరలో మాష్టారు లేరు అప్పుడు ఆండ్రూయే మాష్టారయ్యాడు అతనికి ఆటంటే ఏమిటో తెలుసు ఎలా ఆడాలో కొంత అనుభవం వుంది

లయిన్లీకి బంతి ఆట కొత్త ఏమీ చేతకాదు ఇంట్లోలాగే ఇక్కడ కూడా అల్లరి చేద్దామనుకున్నాడు అన్నగారిదగ్గర ఆ పప్పులేమీ ఉడకలేదు 'నువ్వు పిక్కలు కొచ్చేశావ్ సరిగ్గా ఆడితే ఆడు లేకపోతే ఆటలో అరటిపండును చేసేస్తాను' అంటూ ఆండ్రూ లయిన్లీని ఒక్కటి అంటించాడు

విస్కౌంట్ లయిన్లీ రాకుమారుల వారి అహం దెబ్బతింది అన్న కొట్టిన దానికంటె ఆటమీద ఎక్కువ కోపం వచ్చింది ఆ కోపాన్ని బంతిమీద చూపించాడు అమాంతంగా దానిమీద విరుచుకు పడ్డాడు రాజావారు తలుచుకుంటే బంతే చిక్కదా!

బంతి వెంటనే అతని చేతిలో చిక్కుకుంది ఇంకేం, చెంగున గెంతువేసి అందర్నీ తప్పించుకుంటూ ఎంతో చాకచక్యంతో బంతిని తన్నడం మొదలెట్టాడు లయిన్లీ ఆటస్థలంలోకి అడుగు పెట్టింది అప్పుడే అయినా, అతనిదగ్గరనుంచి బంతిని స్వాధీన పరుచుకోడానికి ఎవరికీ వశం కాకపోయింది అంతిమ విజయం అతనిదే!

రాకుమారులు కూడా అందరిపిల్లల్లానే బంతిఆట ఆడతారు!

ఫొటోలు బి ఐ యస్

కథ: సి. కనకాంబరరాజు



[illegible] సవాలుచేస్తూ ఆడేవాళ్లే లేరు

# న్యూఢిల్లీ లేఖ

(7 వ పేజీ తరువాయి)

సరయిన పద్ధతిని అవలంబించినట్లయితే ధరల స్థిరీకరణ విషయం ఏమంత పెద్ద సమస్య కానేరదు అన్నారు. ఖనిజాలఉత్పత్తి, వ్యవసాయ సంబంధమైన ఉత్పత్తులమీద ఆర్థికపరమైన ఇబ్బందులను కొన్నింటిని తగ్గించడానికి కూడా ఈ విధానం అవలంబించవచ్చును అన్నారు. '1968 మధ్యలో రాష్ట్రాలనుంచి ధాన్యసేకరణ ఆధారంగా చేసుకుని నెమ్మది నెమ్మదిగా ఈ పద్ధతిని ప్రవేశపెట్టడానికి అవకాశం కనిపిస్తున్నది' అని ఆయన అన్నారు. ఈవిల్వలు సేకరణని బట్టి ఆధారపడివుంటాయి. సేకరణ అనేది తప్పనిసరి కాదు! ఇది ఎలా కొనసాగుతుంది? డా. గాడ్గిల్ సూచనలమీద ముఖ్యమంత్రుల అభిప్రాయమేమిటో ఇంకా తెలియవలసి వుంది.

నీరు, విద్యుచ్ఛక్తి రేట్లను సరయిన పంథాలో ఏర్పరచకపోవడంవల్ల వక్రమైన పన్నులు ఎక్కువ చేయవలసి వస్తోంది. అదే ముఖ్యమైన ఆదాయంగా పరిణమించింది .అని డా గాడ్గిల్ మరో విషయాన్ని దృష్టికరించారు. దానిని కూడా ముఖ్యమంత్రులు అంతగా పట్టించుకున్నట్లు లేదు

వ్యవసాయంమీద ఆదాయం పన్ను వేస్తే బావుంటుందని డా. గాడ్గిల్ సూచించినప్పుడు ముఖ్యమంత్రుల గొంతులో పచ్చివెలక్కాయ పడింది! ఈ స్కీమును ముఖ్యమంత్రులంతా ఒక్కుమ్మడిగా నిరాకరించారు. రాష్ట్రాలు భూమి శిస్తును రద్దుచేయడం ద్వారా కొన్నికోట్ల రూపాయల్ని జమనుంచి తొలగించాల్సివచ్చింది. అటువంటప్పుడు డా. గాడ్గిల్ ఉపదేశాన్ని పాటించడం ఎంతయుక్తమైనదో ఆలోచించడం ముఖ్యమంత్రుల పని!

అక్రమమైన పన్నులు హింసాత్మకమైనవి అవి ప్రజల అభిమానాన్ని సంపాదించుకోలేవు అని ఆర్థిక శాస్త్రవేత్తలు అంటూవుంటారు. అభ్యుదయ రాష్ట్రాలన్నీ ఈ విధమైన పన్నులద్వారానే ఆదాయాన్ని సంపాదించుకుంటున్నాయి. ఎన్నికలకి ముందు కామరాజుగారు భూమిశిస్తుకి సవరణలు ప్రతిపాదించారు. తర్వాత అది అనేకమైన అనర్థాలకి దారి తీసింది! ●

# ముఖస్తుతి



కొందరు తమ గొప్పతనాన్ని తామే ప్రకటించుకుంటారు. దాన్ని పెద్దలు హర్షించరు. ఆత్మస్తుతి, పరనిందా కూడదని నాగరకతా ప్రపంచం చాటుతున్నది. తన్ను తానే పొగడుకొనక పోవడం ఉదాత్త నాయకుని ఉత్తమ గుణం.

కొందరు ఆత్మస్తుతి చేసుకొనకపోయినా, ఇతరులు తమర్ని కొనియాడాలనే సంకల్పంతో ఉంటారు. పూర్వం మహారాజులూ, చక్రవర్తులూ ప్రత్యేకంగా వందిమాగధులనే స్తుతి పాఠకులని నియమించేవారు. వారు నియమిత సమయాలలో ప్రభువులను ప్రశంసిస్తూ హెచ్చరిక చేసేవారు. చెయ్యవలసిన పనులను సూచించేవారు. ఇలా స్తుతిపాఠకులను ఏర్పాటు చెయ్యడం పూర్వపు సంప్రదాయం.

ప్రభువులు నియమించకుండా తమంత తామే స్తుతిపాఠకులుగా సిద్ధపడేవారు కొందరుంటారు. వారు ముఖస్తుతి పాఠకులు. వారికి జీతబత్తెాలు వుండవు. శ్రీమంతులనూ, ప్రభువులనూ ఆశ్రయించి ముఖస్తుతి చేస్తూ, దానివల్ల స్వార్థాన్ని సాధించుకోడమే వారి లక్ష్యం. వారిస్తుతులు యదార్థ విషయాలతో కాకుండా అతిశయోక్తులతోనే నిండి ఉంటాయి.

సాధారణంగా మానవ హృదయం సున్నితమైనది. కఠినవాక్యాలకు వ్యధ చెందడమూ, మంచిమాటలకు లొంగిపోవడమూ సహజం. ఎవరైనా తమ్ముగురించి మంచిగా మాట్లాడితే అట్టివారిమీద ఒకవిధమైన అభిమానం కలగడమూ సహజమే! దీనినిబట్టి చాలామంది ముఖస్తుతికి లొంగిపోవడమూ, స్తుతించినవారిపట్ల అభిమానాన్ని చూపడమూ జరుగుతూ ఉంటుంది. స్వార్థాపేక్షతో — తమ మనస్సాక్షికి విరోధంగా ఉన్నతాధికారులనూ, ప్రభువులనూ మెప్పించడానికి ముఖస్తుతి చెయ్యడం కొందరికి పరిపాటి, తమ తమ శక్తిసామర్థ్యాలను ఎరిగిన వారుమాత్రం ముఖస్తుతులకు ఎంతమాత్రమూ లొంగిపోరు.

ఒకప్పుడు ఒకరాజు ఉండేవాడు. ఆయన సహృదయుడు, ఆత్మస్తుతి అతనికి కిట్టదు. ఇతరుల పొగడ్తలకున్నూ అతడు సమ్మతి చూపడు. అందువల్లనే వందిమాగధులు అతని ఆస్థానంలో లేరు.

అయినా, ప్రభువుదయను సంపాదించడానికి మంత్రులూ, కొందరు ఉన్నతోద్యోగులూ ప్రయత్నిస్తూ ముఖస్తుతులు ప్రారంభించారు. వారు ప్రభువును భగవంతునితో సరిపోల్చగా, రాజు చికాకుపడి 'నాకూ దేవునికీ పోలికా ? ఇది పచ్చి



## ధర్మపథం

బుఖుసు వెంకటరమణయ్య

అబద్ధం' అంటే 'అలాకాదు ప్రభూ 'నా విష్ణుః పృథివీపతిః' అన్నారు పెద్దలు. భగవదంశలేనిదే రాజుకావడం సాధ్యంకాదు. తమకు అసాధ్యమయిన పనులేవీ లేవు' — వారు సమాధానం యిచ్చారు.

'అయితే నేను చెప్పినట్లే జరుగుతుందా?' అన్నాడు రాజు.

'ఓ! అభ్యంతరమేమిటి ? మీ ఆజ్ఞకు పంచభూతాలూ లొంగి ఉండవలసినదే!' అని మంత్రులన్నారు.

కొన్ని దినాలు గడిచాయి.

ఒకనాడు రాజు ఎక్కడికో ప్రయాణమై మంత్రులనూ, అధికారులనూ కూడా తన వెంట రమ్మన్నాడు. ఎక్కడికో ఎవ్వరికీ తెలియదు. ప్రభువు ఆజ్ఞను అనుసరించి వారంతా ఆయన వెనకనే వెళ్లారు. తీరా చూస్తే అందరూ సముద్రతీరం చేరుకున్నారు.

సముద్రతీరాన కొంచెంసేపు అందరూ వినోదంగా కాలం గడిపారు. రాజు కూడా చాలా ఉత్సాహంతో ఉన్నట్లే కనబడ్డాడు.

ఆయన 'ఇప్పుడు ఒక చిత్రం చూడండి! నేను ప్రభువును గదా! ఇదిగో! కొండల మాదిరిగా వస్తున్న అలలను ఆపుతాను చూడండి! ఓ అలల్లారా! ముందుకు రాకండి! అక్కడే నిలవండి! నేను ఆజ్ఞాపిస్తున్నాను...' అని గట్టిగా అన్నాడు.

అలలు ఆగలేదు. చాలా ముందుకు వచ్చాయి.

రాజు మొగం చిట్లించుకున్నాడు.

'నా ఆజ్ఞ మీరి వచ్చారు కదూ! మీరు ఇప్పుడేనా నా మాట వినండి. వెనక్కి పోవద్దు. ఆజ్ఞ మీరితే శిక్షకు పాలవుతారు' అన్నాడు మళ్లా.

అలలు వెనక్కుపోనేపోయాయి.

రాజు నవ్వుతూ మంత్రులవైపు చూచి 'పంచభూతాలూ కూడా నాకు లొంగివుంటాయి కదా! నేను భగవదంశను పుట్టినవాడను గదా! మరి యీ కొద్దిపాటి అలలే నామాట వినలేదే ? మీరు యదార్థమే చెప్పారని నేను నమ్మవలసిందేనా ? ఇవి ముఖప్రీతి మాటలు కావా ?' అన్నాడు.

అందరూ తలలు వంచుకున్నారు.

### ఎస్. సి. హెచ్. జి. ఆరుగ్నూరు

మానవుడు తన జీవితములో చేసిన మంచి చెడు పనులకు ప్రతిఫలము ఈ లోకములోనే అనుభవించునా? లేక స్వర్గమంటూ నరకం అంటూ ఉన్నవా?

ఈ కలియుగంలో స్వకీయ పాపపుణ్యాల బేరీజు వర్తమానంలోనే అనుభవిస్తున్నాడు మానవుడు.

### జి. వి. ఎస్. ఎమ్, ధడి సూగూరు (మహారాష్ట్ర)

ప్రతి పురుషుడూ అందరి భార్యలలోనూ చూడకల్గినది. తన భార్యలో చూడలేనిది ఏదో సెలవిస్తారా?

ఆఁ... ...కాదు కాదు. అణకువ!.

### పి. ఏ. ఎస్. పి, హైదరాబాదు

'నవ్వితే నవరత్నాలు అని ఆశ పెట్టి నవ్వు నాలుగిందాల చేటు అని నిరాశ పరిచారు'

నక్క ద్రాక్షపళ్ల కథ చదివి ఉపాసాక్తి చెప్పి వుంటాడెవడో మహానుభావుడు!

### ఆర్. టి. బి, పాలకొల్లు

మా శ్రీవారు నేను కుటుంబ నియంత్రణను పాటించాలనుకుంటున్నాం. ఆపరేషన్ ఎవరు చేయించుకుంటే మంచిది? ఎవరో ఒకరని కాకుండా సరైన జవాబిస్తారని ఎదురు చూస్తాను.

నిజానికి ఎవరు చేయించుకున్నా ఒకటే సోదరీ. కాని పురుషులకు సులభం, స్త్రీలకు కొంచెం కష్టమైన ఆపరేషను కనుక— ఎవరు చేయించుకోవాలన్నది మీలో మీరు నిర్ణయించుకోవాలి. మీ నిర్ణయాల మేలోగా సంసారం ఎన్నిమొట్లు పెరుగుతుందో కూడా వోకంట కనిపెట్టండి! ఆలస్యం అమృతం విషం అన్నారు గదా పెద్దలు.

### కె. ఆర్. కె. యు, కొత్తపల్లి

పెండ్లి చేసుకొని రెండు నెలలు ఒక మునుపే అత్త అమ్మల మనస్పర్థలవల్ల వేరు చేయబడ్డ భార్యాభర్తలకు మీ సలహా ఏమిటి?

కొత్త సంసారం కూడ కత్తిమీద సాములాంటిదే. వోర్పు వహించండి!

### ఇ. టి. ఆర్, కావలి

గృహిణులైన రచయిత్రుల జీవితం సాధారణ గృహిణులవలెకాక వేరువిధంగా ఉంటుందని అభిప్రాయపడుతున్నాను. మీ అభిప్రాయం?

ఎందుకు వేరే ఉంటుందని అభిప్రాయపడుతున్నారు? రచయిత్రి స్త్రీకాదా? గృహిణి కాదా? తల్లికాదా?




### డి. డి. పి, గుంటూరు

వ్యక్తిత్వం అంటే అర్థం ఏమిటో?

మనిషికి ప్రత్యేకత నిచ్చేదే ఆ మనిషి వ్యక్తిత్వం.

### కె. వి. పి, నెల్లూరు

అక్కయ్యగారూ, వనితలకి ప్రత్యేకంగా వనితావాణి, గోంగూరా గట్టాలున్నాయి కదా, పురుషుల కింతవరకు ప్రత్యేకంగా ఒక శీర్షిక పడ్డ పాపానపోలేదు ఎందుకండీ?

వనితావాణి గోంగూరగట్టాల్లో ఉన్న మజా అలాంటిది తమ్ముడూ, ఈ శీర్షికలు చాలామటుక్కు మగవాళ్లు చదువుతారనేగ! మళ్లీమీకు ప్రత్యేకంగ ఎందుకు?

### వి.మ.ల, బరంపురం

మీ కథలు బాగుంటాయి; మీ జవాబులు ముచ్చటగా ఉంటాయి. మీ మనస్సు సున్నితమైనది. మీ పలుకులు కూడా తియ్యగా ఉంటాయేమో వినడానికి ఓ శుభోదయాన మీ దర్శనార్థం వస్తున్నాం. మీకు అభ్యంతరం ఉండదనుకుంటాం.

వెల్‌కమ్! ఫ్రెండ్స్.

### సి. ఆర్. బి, విశాఖ

ఏమండీ మీరు కె. రామలక్ష్మిగానే ఉండిపోడానికి కారణం ఎలిజబెత్ టైలరంత గొప్పదాన్నయిపోవాలనా?

అలా ఎందుకనుకుంటానూ? ఒకవేళ అనుకున్నా మీకు చెప్పేటంత తెలివితక్కువదాన్నా! రచయిత్రిగా ఆ పేరుతో వ్యవహరించడం అలవాటైపోయింది. అంతే

### డి. జె. ఎన్. ఆర్, బొంబాయి

ప్రేమించి పెళ్లి చేసుకోవడం మంచిదా? పెళ్లాడి ప్రేమించడం మంచిదా?

ఎలానుంచి ఎట్లైనా దంపతులమధ్య 'ప్రేమ' ఉండడం ప్రధానం.

### ఇ. టి. ఆర్. ఆర్, కావలి

జీవితాన్ని సీరియస్‌గా తీసుకోని వారి గతి...?

సీరియస్‌గా తీసుకొనివారి గతే.

ఆడదాని ట్రేడ్ మార్కు అసూయ అను సామెత ఎంతవరకు నిజం?

ఆ నిజాన్ని పరీక్షకు పెట్టనంతవరకు.

### డి. ఎల్. ఎన్. ఎమ్, శాంతీపురం

ఆంధ్ర మహాభారతము రామాయణము మీ రెంతవరకు నమ్ముతారు?

నమ్మడం ఏమిటి? చదవడమే. ఆ మహా కావ్యాలు చదివినకొద్దీ అందంగా కనిపిస్తాయి.

### ఎ. వి. ఎల్, హైదరాబాదు

కోపం స్త్రీల కెక్కువా? పురుషుల కెక్కువా?

కోపానికి స్త్రీ పురుష భేదం లేదు. అందరికీ ఒకలాగే కోపం వస్తుంది. స్త్రీ సాధ్యమైనంతవరకు పైకి తేదు. పురుషుడు ప్రదర్శిస్తాడు అంతే తేడా.

### టి. ఎస్, హైదరాబాదు

మన సంపాదకులు ఏదో నెపంతో రచనలు తిప్పిపంపుతారు. ప్రముఖులను తగ్గించి కొత్తవారివి కథలు ప్రచురిస్తే బాగుంటుంది.

ఎందుకు బాగుండదూ? బాగానే ఉంటుంది. కాని ఈ ప్రముఖులూ ఒకప్పుడు కొత్తవారే సోదరీ, ఆ సంగతి మరిచిపోయి సంపాదకులపై నేరం వేయకు.

### కె. రా, అనంతపురం

నాకు కథలు వ్రాయాలనిపిస్తుంది. కాని ఏ విధంగా మొదలుపెట్టవలెనో ఏ విధముగా వ్రాయవలెనో తెలియకున్నది.

కొంచెం ఆలోచించి వ్రాయడం అలవాటు చేసుకుని మరీ రచన సాగించు చెల్లెలా, వ్రాయాలనిపించినంతమాత్రాన వ్రాయకల్గడం కష్టం. కృషి కూడా కావాలి.

నాతో కలం స్నేహం చేయడం యిష్టమేనా? అయితే దిగువ నా అడ్రసు ఉంది.

వెనకటికి 'వాంపాయింత ఎడం ఉంటే మహా గారి ముక్కే తినేవాణ్ణి' అన్నాట్ట ఒకడు. అలాగా ఆమాత్రం వ్యవధి చిక్కితే అలాగే వ్రాస్తా!

### పి. వి. ఆర్, విశాఖపట్నం

జీవితంలో మనిషికి కావలసినవన్నీ ఉన్నవి. కాని ఎందుకో ఏదో లోటు కన్పిస్తూ మనస్సుకు శాంతిలేకుండా ఉంది.

మనిషికి లోటు కనిపించని దెప్పుడు? మనసుకు శాంతి చిక్కే దెప్పుడు?......

రీటా ఫరియా

# ఎకువడోర్ హోటల్ గదిలో అసలు ఏమిటి జరిగింది?...

ఒక చిన్న తలుపు!

రెండు హోటలు గదులమధ్య చిన్న తలుపు ఎంతో గొడవకి కారణం. ఇంత గొడవ నేను 12 నెలలు ప్రపంచ సుందరిగా ఏలినకాలంలో రాలేదు. ఒక గదిలో నేను ఉన్నాను. రెండవ గదిలో నా కాబోయే భర్త డేవిడ్ గార్స్టన్ ఉన్నాడు.

మధ్య తలుపుని చూసిన కొందరు మేమిద్దరం ఒకేగదిని వాడుతున్నామనే పుకారు లేవదీశారు.



అనురాగానికి ప్రతిబింబం.

మూడురోజులు మా తలుపులకి గొళ్ళాలు పెట్టుకుని బయట కార్యక్రమాలన్నిటి గురించీ మరిచిపోయామన్నారు. భోజనాలకి తప్ప బయటకి రావటంలేదనేవారు.

ఇదెంత పిచ్చి వదంతో చెప్పక్కర్లేదు. అసలు జరిగిందేమిటంటే...

డేవిడ్ (గార్స్టన్) ఒక అమెరికన్ లాయరు. నన్ను కలుసుకోవటానికి బ్రిటన్‌కి వచ్చాడు. అక్కడే నాలుగురోజులు ఉండిపోదామనుకున్నాడు. ఇంతలో నేను ఎకువడోర్‌కి వెళ్ళవలసివచ్చింది.

ఇద్దరం అక్కడ కలుసుకుందామనుకున్నాము. ఆ తర్వాత చిన్న సెలవ తీసుకోవచ్చునమకున్నాము.

లాటిన్ అమెరికాలో ఇటువంటి సెలవలు తగవని ఎవరో అన్నారు. అయితే ఇంత గొడవ వస్తుందని మాత్రం నేను ఎదురు చూడలేదు. డేవిడ్ మా ఇద్దరికీ రెండుగదులు బుక్‌చేశాడు. రెంటికీ మధ్య తలుపు ఒకటి ఉంది.

ఇదంతా ఇలా ఉండగా ప్రపంచసుందరి పోటీ నిర్వాహకులకీ నాకూ కొన్ని కర్చుల విషయమయి పేచీలు వచ్చాయి. ఇవన్నీ తేలేదాకా గది వదిలి వెళ్ళవద్దన్నాడు నన్ను డేవిడ్. అంతదాకా తలుపులు వేసుకుని కూర్చున్నాము.

ఆరు గంటలలో కర్చులకి కావలసిన డబ్బు, టిక్కెట్లు వచ్చాయి.

ఈ ఆరుగంటలలో తలుపులకి గడియలు గాని తాళాలుగాని వెయ్యలేదు.

అసలు మేమిద్దరం ఏకాంతంగా ఉండా

అనుకుంటే తలుపులకి గడియలు వెయ్యడం ఏం ఖర్మ మా కెందుకు పడుతుంది? మా గదుల మధ్య తలుపు ఉండనే ఉందికదా.

ఆరుగంటలు 'మూడు రోజు' లలా అయ్యాయో నాకు ఇప్పటికీ తెలియటంలేదు.

అయితే మేమిద్దరం కలిసే ఉన్నామో లేదో ఇతరులకి అనవసరం. మా స్వవిషయాలు కావి.

ఇద్దరు యువతీ యువకులు ఒకరినొకరు ప్రేమించుకున్నారు. ఇద్దరూ పెళ్లిచేసుకోబోతున్నారు. ఇందులో సిగ్గుపడవలసిన విషయం ఏముంది?

కాని, వింటర్ ముగారు నా జీవితంలో అనవసరమయిన వివాదాలకి అవకాశాలు కల్పించారు ఈ 12 నెలల్లో.

కొందరు వివాహంచేసుకోమని వేధించేవారు. కొందరు ఇంకా ఏదో కోరేవారు. అనవసరంగా నా పేరుని రచ్చకి ఈడిచేవారు.



1967 ప్రపంచసుందరిగా ఎన్నికైన కుమారి మెడెలిన్ హార్టాంగ్‌బెల్ (మిస్. పెరూ). ఆమెకి యిరువైపుల ఉన్నవారు రన్నర్స్ అప్‌గా వచ్చిన షకీరాబక్ష్ (మిస్ గయానా), కుమారి మారియాకార్లియాపొస్కాన్ (మిస్ అర్జెంటయిన్).

# నా అనుభవాలు

ఇప్పుడు కొందరు మగవారిని గురించి చెప్తాను...

మొదట అన్‌బార్న్‌లోబో: ఇతన్ని భారత దేశంలో పెళ్లిచేసు కుందామను కున్నాను...

తర్వాత, లండన్‌లో నాకు తోడుగా తిరిగిన భారతీయ వ్యాపారి ఒకతను...

ఇంకా నన్ను మత్తుమందుల వ్యాపారంలో ఇరికించాలని చూసినవారు...

నేను రహస్యంగా ఒక 'స్పానిష్ ప్రియుడి'ని కలుసుకుంటున్నానని మరొక వదంతి బయలుదేరింది...

నిజానికి నేను కలిసిన చాలామంది పురుషులు మా కుటుంబానికి స్నేహితులు.

తక్కినవారితో నాకు అసలు పరిచయమే లేదు, ఎక్కడో విందులో కలవటం తప్ప.

ఉదాహరణకి — నేను మత్తు మందు రవాణాలో ఉన్నాననే పుకారుకి కారణం ఒక వ్యక్తిని కలవటమే. ఈ వ్యక్తి నాకు చిన్ననాటి మిత్రుడు. చూసి చాలాకాలం అయింది. అప్పుడు విమానంలో స్టువార్డ్‌గా పని చేస్తున్నాడు. లండన్‌లో ఉన్నాడు గనుక ఒకసారి వెళ్లి అతన్ని అతని హొటలులో చూద్దామనుకొన్నాను. నా వెంట మరొక భారతీయ యువతి వచ్చింది.

పల్లటి పంట్లామూ, పాత స్వెట్టరు ఒకటే వేసుకుని ఉన్నాను. ఇలా సాదాగా వెళ్లటమే మంచిదనుకున్నాను. అనవసరంగా ఒక 'ఆకర్షణ' కావటం దేనికి?

హొటలు రిసెప్షను వద్ద మా స్నేహితుడి గురించి అడిగాము. గదిలో లేడని విన్నాము.

కాని, అక్కడి గుమాస్తా అంతటితో ఊరుకోక — 'మా మేనేజర్ మీతో మాట్లాడా లనుకుంటున్నాడు.' అన్నాడు.

ఎందుకా, అనుకొంటూనే అతని కోసం అక్కడే కాచుకుని కూర్చున్నాము. కొంతసేపటి తర్వాత మేనేజర్ అదులు ఇద్దరు వ్యక్తులెవరో వచ్చారు.

'మేము పోలీసు అధికార్లం' అన్నాడు వారిలో ఒకడు. 'మీతో మాట్లాడాలి...'

నేను మెడికల్ స్టూడెంటుని. రక్తపుపోటు అంటే ఏమిటో తెలుసు. అప్పుడు నా బ్లడ్ ప్రెషర్ విపరీతంగా పెరిగింది!

తర్వాత అరగంటలో మరింత పెరిగింది. పోలీసు అధికారుల ధోరణి అలా ఉంది...

నా స్నేహితుడిని ఆ ఉదయమే దొంగతనంగ మత్తుమందులు రవాణా చేస్తున్నందుకు ఎరెస్టు చేశారుట!

అతని గది సోదాచెయ్యగా అక్కడ మత్తుమందు ఎంతో దొరికిందిట.

నేనూ, నాతోవచ్చిన అమ్మాయీ అతని ముఠాలో వారమే అని అనుమానిస్తున్నారుట!!

—నాకు బేడీలు తగిలించి స్టేషన్‌కి తీసుకుపోతారా, అనుకున్నాను భయంగా. ఇదే జరిగితే పత్రికలు ఏమంటాయి?

'నాకు మత్తుమందులతో సంబంధం ఏమిటి?' అన్నాను. 'నేను రీటా ఫరియాని...ప్రపంచ సుందరిని, తెలుసుగా? నా స్నేహితుడిని చూద్దామని వచ్చాను...'

డిటెక్టివ్‌లు నా ముఖాన్ని పరిశీలనగా చూశారు. నా లాగూలవయిపు చూశారు.— అబ్బ, చీరకట్టుకుని వచ్చి ఉంటే ఎంత బాగుండును!' అనుకున్నాను.

హటాత్తుగా ఒక డిటెక్టివ్ చిరునవ్వు నవ్వాడు. 'మిమ్మల్ని పోలిక పట్టగలిగాను గాని మీ వాలకం చూసి కొంత సందేహించాను!' అన్నాడు.

కొంతసేపు కబుర్లు చెప్పి ఎవరి దారిని వారు వెళ్లిపోయారు. మళ్లీ నన్ను అరెస్టు చెయ్యలేదు!

ఈ డిటెక్టివ్‌లు ఏమీ తెలియని వాళ్లయితే నన్ను స్టేషన్‌కి తీసుకుపోయి నానా ప్రశ్నలతో చంపేవారు! ఈ రకం ప్రచారం నాకు మంచిదికాదు.

కొన్ని పత్రికలు నా ప్రణయ జీవితం గురించి విచిత్రమయిన కథలు అల్లాయి. అవి చాలవూ, ఈ బెడదకూడా తెచ్చుకొనటానికి!

కొందరు నాది రాతిగుండె అన్నారు ఇది నిజమా? వచ్చేవారం నేను చెప్పేది చదివి మీరే నిర్ణయించుకొనండి!

(ఇంకా ఉంది)

బియస్ఎ మీ వంటి ఉత్సాహవంతుల ప్రథమాభిలాష, సహజమే. బియస్ఎ అందము బైసికిల్ సాంస్కృతిక సౌందర్యము ఎంతో తేలికైనది అయినా బలిష్ఠమైనది. అనాయాసంగా సైకిల్ తొక్కడానికి స్నిగ్ధత వేగము కలిగి ఉంటుంది.

బియస్ఎతో వినోద విహారాలు చేయండి

బియస్ఎ సైకిల్ ప్రసిద్ధిపొందిన ఉచ్ఛ ప్రమాణాలకు అనుగుణ్యంగా ప్రపంచంలో విశిష్టమైన సైకిళ్లను నిర్మించేవారిచే ఇక్కడ నిర్మించబడింది.

**BSA**®

బియస్ఎ శ్రేష్ఠమైన బైసికిల్





[illegible]
ఇండియాలో తయారు చేయువారు : టిఐ సైకిల్స్ ఆఫ్ ఇండియా [illegible]
ప్రొప్రైటర్లు : ట్యూబ్ ఇన్వెస్ట్‌మెంట్స్ ఆఫ్ ఇండియా లిమిటెడ్, మద్రాసు-1.
రిజిష్టరు కావింపబడినవాడు.




మా చిన్నది ఆటలో పడి వెక్కుతూ ఏడుస్తూ ఇంట్లోకి వచ్చినా మా పక్కింటావిడ మాటలు జ్ఞాపకానికి వచ్చి నవ్వు తెస్తాయి. వాళ్ల రెండోవాడు ఆటలో ఎప్పు డేడ్చినా సరే కొంగున చేతులు తుడుచుకుంటూ 'ఎవరు తోశారురా? ఎవరు పడ గొట్టారు?' అంటూ ఇవతలికి వస్తుందావిడగారు. ఎవరేనా తోస్తేనూ, పడదోస్తేనూ తప్పించి తన బంగారుకొండ పడడని ఆవిడ నిశ్చితాభిప్రాయం!

పిల్లలు ఆడుతారు. పడతారు. మనం చూసి చూడనట్టు ఊరుకుంటే వాళ్లే లేచి దులిపేసుకుంటారు. మీరు ఎప్పుడేనా గమనించారో లేదో—చంటివాళ్లకో చక్కని గుణం ఉంది. మనం 'అయ్యో పడ్డావా' అని అప్యాయంగా లేవనెత్తితే చాలు భోరున ఏడ్పు ప్రారంభించి, ఓ పట్టాన ఊరుకోరు. అదే మనం చూడకపోతే అటూ యిటూ చూసి లేచి చక్కా వస్తారు!

అంతమాత్రంచేత పడి రక్తం కారి దెబ్బలు తగిలితే చూస్తూ ఊరుకోమని కాదు. ఆ దెబ్బ తగలడానికి కారణం అజాగ్రత్తగాని ఆడుకుందుకొచ్చిన పక్కింటి పిల్లలు కారని చిన్నతనంనుంచీ కుర్రవాళ్ళకి నేర్పి అందరితో సరదాగా ఉండడం నేర్పాలనే నా ఉద్దేశ్యం.

కొందరు తల్లులది మరీ చాదస్తం. సాయంత్రం అందరి పిల్లలూ పరుగులు తీసి కేకలు వేస్తూ ఆడుకుంటూ ఉంటే, తమ పిల్లల్ని చక్కగా ముస్తాబుచేసి అరుగు మీద కూర్చోపెట్టి చూస్తూ ఉండమంటారు. అది వాళ్లకి సాధ్యమా? ఏ పిల్లో 'ఒంటిపిల్లి రాకాసి' అంటుంది. దాంతో వాళ్లకీ వీళ్లకీ మాటా మాటా పెరగడం మాట్లాడుకోవడం మానేయడందాకా వెడుతుంది.

ఇంకోరకం తల్లులుంటారు. తమ కళ్ళ ముందు కాకుండా ఏ కేనాపోయి ఆడుకుంటే చాలు వాళ్ళకి! ఇంకా ఓ రకం ఉంటారు. 'కేకలేయకుండా పరుగెత్తకుండా కూర్చున్న చోటే ఉండి ఆడుకో'మని ఆజ్ఞవేసి ఊరుకుంటారు!!

పిల్లలకుండే శక్తి ఆటపాటల్లో ఖర్చు కావాలే తప్పించి వేరేవిధంగా కాదు. వాళ్ళు కొందరు పెద్దవాళ్లలాగా తిని కూర్చోలేరు. అలా కూర్చోపెడితేనే ఏదో ఒక అల్లరికి దిగుతారు.

సాయంత్రంపూట పిల్లలని అలిసిపోయేలా ఆడుకోనివ్వాలి. అప్పుడు కాళ్ళు చేతులూ ముఖాలూ కడుక్కుని కడుపు నిండా అన్నం తింటే హాయిగా నిద్ర పోతారు. ఆరోగ్యంగా ఉంటారు.

ఈ ఆటపాటలన్నవి పెద్దాళ్లతో కలిసి సాగించమంటే కుర్రవాళ్లకి తృప్తి ఉండదు. తమ వయస్సువాళ్లతో, స్నేహితులతో కలిసి కేరింతాలుకొడుతూ ఆడుకోవాలని ఉంటుంది వాళ్లకి. బుద్ధిగా కూర్చుని ఆడుకోడం కాదు, బుద్ధిగా ఆడుకురావాలి. ఆటల్లో గెలుపూ ఓటమీ ఉంటుంది. గెలిస్తే ఉప్పొంగిపోయిన పిల్లలు ఓటమికి కృంగిపోకుండా ఉండకల్గాలి. అలాంటి మనో నిబ్బరం, సంఘీభావం రావాలంటే పలుగురితో కలిసి తిరిగితేనే పిల్లలకి వస్తుంది. తల్లి తను అండగా ఉండి అడిస్తే వచ్చే గుణం కాదిది. అవ్వాలంటూ ఉంటారు 'ఆటలో అరటిపండు తిన ఏడుస్తారా ఎవరేనా?' అని. నిజమే ఆటలో పడినప్పుడు 'ఛ అలా పడ్డావేమిటి నాన్న' అని తోసి పారేయటేగాని 'ఎవరు తోశారురా?' అంటూ తల్లి దెబ్బలాటకి వెళ్లిపోకూడదు.

—కె. కాముడమ్మ

# డాక్టర్ కబుర్లు

## ఊరగాయలు

ఈమధ్య అమెరికాలో ఊరగాయల ప్రాముఖ్యత పెరుగుతోంది. దేహానికి ఉప్పు అవసరం. గుండె జబ్బు



ఉండేవారికీ, కిడ్నీ రోగాలతో బాధపడేవారికి ఉప్పులేని ఆహారం అవసరం అంటారు వైద్యులు. ఈ నిబంధన లేని వాళ్ళు ఊరగాయలద్వారా వంటికి కావలసిన ఉప్పు తినవచ్చు.

వ్యాయామంతర్వాత, చెమట బాగా పోసినప్పుడు ఉప్పు తినాలి. చిన్న ఊరగాయముక్క కావలసినంత ఉప్పు ఇవ్వగలదు.

అంతేకాక, తేలికగా అరుగుతుంది. జీర్ణశక్తిని అధికం చేస్తుంది. తగినంత ఉప్పు, విటమిన్లు, ధాతువులు కలిగి ఉంటుంది. విటమిన్ 'సి' పూరగాయ ద్వారా బాగా వంటపడుతుంది.

క్షయరోగానికి ఊరగాయలంటే చాలా ఇష్టంట—ఆరోగ్యానికి, అందానికీ మంచిదనేదిట. నిజమేగామరి!

హెచ్. ఎల్. హార్లెస్టన్

(అనువాదం)

# ఎంత నిద్ర అవసరం?

# కలలు ఎందుకు కంటాము?

మనకెంత నిద్ర అవసరం? ఇది అతి ముఖ్యమయిన ప్రశ్న. ఎందుకంటే నేటి ప్రపంచంలో చాలా మంది తమ వృత్తి వల్ల వేళగాని వేళలలో పని చేస్తూ ఉండటం జరుగుతోంది—డాక్టర్లు, నర్సులు, పోలీసు వారు, కార్మికులు, రయిలుబళ్లు — విమానాలు—బస్సులు నడిపేవారు వగయిరా. విమానాలు, బస్సులు ప్రమాదాలలో ఇరుక్కొనటానికి చోదకుల పొరపాట్లు కారణం అని ఎన్ని నివేదికలలోనో రావటం మనం చూస్తూ ఉంటాము. ఇవి అలసట వల్ల వచ్చిన పొరపాట్లా, అనే అనుమానం ఎందరికో కలుగుతుంది.

నిద్ర ఏ మాత్రం కొరవడినా ప్రమాదమేనని ఇటీవల కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో జరిగిన పరిశోధనలు సూచిస్తున్నాయి. ఇవి పరిశోధనశాలలలో జరిగినవి. నిత్య జీవితంలో కూడా ఇటువంటి అనుమానాలకి అవకాశం ఉందో లేదో చెప్పటం కష్టం కాని ఈ విషయమయి పరిశోధన మరింత జరగాలని మాత్రం గట్టిగా చెప్పవచ్చు.

**కొత్త పరిశోధనలు**

కేంబ్రిడ్జిలో కొన్ని కొత్త పరిశోధనలు జరిపారు. ఒక్కొక్క రాత్రి ఒక్కొక్క కాల పరిమాణం దాకా నిద్రపోయిన వారికి పగటి పూట కొన్ని చిన్న పనులు—ఏకాగ్రత కావలసినవి—కల్పించారు.

రాత్రి అయిదు గంటల నిద్ర (ఇంగ్లండ్‌లో) మనిషికి చాలుట. రెండు గంటలకన్నా తక్కువ నిద్ర దొరికిన వారి మనస్సు పనిమీద సరిగ్గా లగ్నం కాదు. నిద్రా భంగం కొంత మాత్రమే అయితే చిన్న 'బహుమతు'లతో ఏకాగ్రతని అధికం చెయ్యవచ్చుట కాని రాత్రికి రెండుగంటల నిద్ర కూడా లేకపోతే ఎటువంటి బహుమతి కూడా కార్యదీక్షతని ఎక్కువ చెయ్యలేదుట.

మొదటి రెండుగంటలూ వచ్చే నిద్ర అతిగాఢమయినదీ, స్వప్నరహితమయినదీ అని శాస్త్రజ్ఞులు చెబుతున్నారు.

ఇంకా పరిశోధన అవసరం. వైద్యుల వంటి వ్యక్తులకి నిద్ర తక్కువ అయితే కలిగే పరిణామం ఏమిటో ఊహించటం కష్టం కాదు.

**కలల అవసరం**

నిద్ర సంగతి సరే. కలల మాట ఏమిటి? నిద్రని పొగిడే వారి సంఖ్య తక్కువ కాదు కాని కలల గురించి మనకి తెలిసింది తక్కువే. హామ్లెట్ మరణం అనే నిద్రలో కలలు కనరాదని అనుకుంటాడు. కాని శాస్త్రజ్ఞులు నిద్రకి కలలు అవసరం అంటున్నారు. ఎందుకు అవసరం అని అడిగితే మాత్రం చెప్పరు!

పరిశోధనలు జరుగుతున్నాయి. నిద్రపోయే వారి కంటి రెప్పలు కదులుతూ ఉంటాయి. ఇవి కదలటం మొదలుపెట్టగానే నిద్రపోయే వారిని లేపవచ్చు. ఈ విధంగా వారి కలలు చెడిపోతాయి. కొందరికి ఇలా కొన్ని రోజులు చెయ్యగానే వారు 'ఇంకా కలలు కనటానికి' ప్రయత్నించటం ప్రారంభించారుట. ఈ ప్రయత్నాల ఫలితంగా చిన్న కాలవ్యవధిలో అధిక స్వప్నాలు కను కొనటం అలవాటు చేసుకుంటారుట. ఈ అలవాటు అయిన తర్వాత వారిని మామూలుగా నిద్రపోనిస్తే వారి కలలు ఎక్కువ అయి తిరిగి 'సాధారణ స్వప్నాల కోటా' రావటానికి కొంతకాలం అవుతుందిట.

అధికంగా పాలు పుచ్చుకుంటే కలలు బాగా తగ్గిపోతాయి. దేహం అవసరమయిన కలలని మెలకువ సమయంలో తెప్పించుకొనటానికి ప్రయత్నించవచ్చు. ఈ విధంగా 'పగటి కలలు' లేక 'మతి విభ్రమణ' అధికం కావచ్చు!

—స్వప్నాలు ఎందుకు? అనే ప్రశ్నకి ఎన్నో సమాధానాలు ఉన్నాయి. కొందరు ఆధునికులు మెదడు కూడా ఒక యంత్రం కాబట్టి నేటి కంప్యూటర్లలాగ అవి కలలు అనే ఆలోచనలని ఇలా ప్రాక్టీసు చేస్తాయి అంటారు. ఫ్రాయిడ్ వంటి మనశ్శాస్త్రజ్ఞుల సంగతి సరేసరి! ఏది ఎలా ఉన్నా కలలు అవసరం. (అంతేకాదు, వాటిని జ్ఞాపకం తెచ్చుకొనటం మాత్రం అనవసరంట!)

—జాన్ న్యూవెల్ (ఫో.వ.ఫీ.)



# అంతరించా జ్ఞానదివా...

'అమ్మా ఏమిటి నువ్వు చేస్తున్నది!' అని అరిచింది బాధగా ఒక యువతి పొయ్యి వయిపు పరిగెత్తుతూ. అది రెండు శతాబ్దాల కిందటి మాట. బాందెం గ్రామంలో మిట్టమధ్యాహ్నం వేళ. 'అయ్యో! నువ్వు దేన్ని తగలపెడుతున్నావో తెలుసా? అది విలువలేనిది! అసలే ఆలోచన లేకుండా పోతోందే నీకు' ఆ అమ్మాయి కళ్ళనీరు పొంగాయి. పడావుడిగా పొయ్యిపక్కనే పడి ఉన్న ఎండుటాకుల కుప్పని అవతలికి లాగేసింది. తనతల్లి అందులోని ఆకులనే కట్టలు కట్టలుగా పొయ్యిలో పెడుతోంది.

ఆ ఆకులు వట్టి ఆకులుమాత్రం కావు. అవి ఆ ముసలావిడ కొడుకు సొహిరోబా కట్టిన పాటలు రాసి ఉన్న పత్రాలు. అతను భక్తిగీతాలు కట్టేవాడు. అతని కుటుంబం ఎంత బీదదంటే సొహిరోబాకి కాగితం కొనుక్కునే శక్తికూడా లేకపోయేది. అతని విధవ చెల్లెలు మాత్రం ఈ భక్తిగీతాలలోని గొప్పతనం గ్రహించి వాటిని తనే ఆకులమీద రాసేది వాటిని భద్రంగా దాచేది.

సొహిరోబా 1714 లో సావంతవాడి ప్రాంతంలో జన్మించాడు! అతని చిన్న వయస్సులోనే అతని కుటుంబం బాందెం గ్రామానికి వలస వెళ్లిపోయారు. పెద్దవాడయిన తర్వాత సొహిరోబా కరణం అయ్యాడు. కాని, ఆ ప్రాంతం అధిపతి దుష్టుడు కావటంచేత ఆ వృత్తి వదులుకుని కేవలం భగవత్ప్రార్థనలో మునిగి పోయాడు. అతనికి నాథ్ మతం స్థాపకుడు గైబినాథ్ ఒకసారి సాక్షాత్కరించి ఉపదేశం చేశాడుట.

నేడు సొహిరోబా భక్తిగీతాలే మంచి ప్రచారంలో ఉన్నాయి. కాని అతను 'కొన్ని సిద్ధాంతాలకి సంబంధించిన సూత్ర గ్రంథాలు ఎన్నోకూడా రాశాడు. వీటిలో 'సిద్ధాంత సంహిత' అనేది ప్రసిద్ధమయినది ఇందులో సొహిరోబా జ్ఞానం, నీతి, యోగం మొదలయిన వాటిని చర్చించాడు.

సొహిరోబా గృహస్థాశ్రమాన్ని గర్హించలేదు. బాగా వయస్సు ముదిరినతర్వాత తన కొడుకులు ఇద్దరితో తీర్థయాత్రల మీద బయలుదేరాడు. చివరికి గ్వాలియర్ (లేక గవాలియర్) లో స్థిరపడిపోయాడు. అక్కడ ఒక మఠం స్థాపించాడు. పది సంవత్సరాలుగా ఎందరికో జ్ఞానభిక్ష పెట్టాడు. ఒకరోజు హటాత్తుగా మాయమయి పోయాడు. (1789 సంవత్సరంలో.) అతని గదిలో మాత్రం శిష్యులకి ఒక కాగితంముక్క దొరికింది. దానిమీద ఇలా రాసి ఉంది—

'నేను రాలేదు
నేను వెళ్లిపోలేదు
నేను కనిపించటం కొంతకాలం మిథ్య
నేను మేలుకొన్నాను
కల కరిగి పోయింది
మచ్ఛీంద్ర జలంధర
గోరఖనాధుడు వచ్చి నన్ను
తనలో అయిక్యం చేసుకున్నాడు.

సొహిరోబా తన భక్తిగీతాలకి రాగాలు కూడా రాశాడు. అధునిక కాలంలో గాంధీగారుకూడా తమ ఆశ్రమ భజనావళిలో సొహిరోబా గీతం ఒకదానినికూడా చేర్చారు

'అంతరించా జ్ఞానదివా
మాలవూం నకో రే!'

అని ప్రారంభం అయ్యే ఈ పాట 'నీలోని జ్ఞానదీపాన్ని ఆర్పకు!' అని బోధిస్తుంది.

—ఎస్.





సీరియల్

కె. రామలక్ష్మి

**జరిగిన కథ**

**కళ్యాణి** గవర్నమెంటు హాస్పిటల్లో డాక్టరు. ప్రిస్క్రిప్షన్లతోటే ఆమెకు సంతకాల గొడవే ఎక్కువ. వాటి చాంచల్యంతో ఒక పిల్లవాణ్ని హత్య చేసిందన్న నేరారోపణపై, పోలీసు ఉద్యోగి ఒకామెను కళ్యాణి వద్దకు తీసుకొచ్చాడు. కళ్యాణి ఆమెమీద ఎంతో జాలిపడింది. స్నేహితురాలు లాయరు శాంతి సహాయాన్ని కోరింది శాంత ఆమె తరఫున కోర్టులో వాదించడానికి వకాల్తా పుచ్చుకుంటుంది. పంతులు కోర్టులో సరళ గురించిన ఒక ప్రేమ కథని కోర్టులో చెబుతాడు. సరళ ఒకతనిని ప్రేమించింది. మరొక వయసు మళ్లినవాడితో పెళ్ళయింది. అతనుపోయాడు. కొంతకాలానికి పుట్టిన పిల్లవాడు కూడా పోయాడు. పిల్లలతోటే ఆమెకి ప్రాణం. ప్రజలామెని పిచ్చిదాన్ని చేశారు. ఆ కోవ పిల్లవాడు దొరుకుతాడు.

# 9

సరళ పిచ్చిలోకానికి కొత్త వెల్గు వచ్చింది. కుర్రవాడితో క్షరవై నాలుగ్గంటలు సరిపడడం లేదు. వాడికి కావలసినవన్నీ అటూ ఇటూ తిరిగి సేకరించడంలో సరిపోతూంది. వాడితోటే లోకంగా కాలం గడుపుతుంది ..

కాని కుర్రవాడిది ఆమెతోటిదే లోకం కాదుగదా ? ఒకనాడు ... ఆరోజు సరళ జీవితం మరో మలుపు తిరిగింది. కుర్రవాడు అడిగాడుకదా అని చిన్నసంచీ సంపాదించాలని బయలుదేరింది. చివరికి ఎక్కడా దొరకలేదు. అడిగితే ఎవరిస్తారని స్కూలు దగ్గర కాపు కాచి కూర్చుంది. అమాయికంగా కనబడ్డ ఓ కుర్రవాడిచేతిలో సంచి లాక్కుని ఒక్క పరుగున పారిపోయి వచ్చింది. కాని ఏం లాభం ? పాక తలుపులు బార్లా తీసి ఉన్నాయి. పాకలో [illegible]

డైనా దాక్కున్నాడేమో అని తెగ వెతికింది. కాని ఎక్కడా కనబడలేదు. దానితో సరళకి స్మిమితం తప్పిపోయింది. తిరిగి యధా ప్రకారంగా పిల్లలచుట్టూ తిరగడం ప్రారంభించింది. స్కూళ్ల ప్రాంతాలలో తన బాబు కన్పిస్తాడేమో అని వెదకసాగింది. ఆ కుర్రవాణ్ని పోలినవాడెవరైనా కనిపిస్తే చాలు నిలదీసి చూడ్డం ప్రారంభించింది.

దీనికి పిచ్చి ముదిరింది అనుకున్నారు. ఆడించేవాళ్లు ఎక్కువ అయ్యారు, రాళ్లు రువ్వేవాళ్లు ఎక్కువ అయ్యారు. సరళ వంటినిండా గాయాలే. అసలు పాకలో ఉండడం మానేసి తిరుగుతూంది. అటువంటి సరళనే ఇప్పుడు హత్యానేరం మోపి ఇక్కడ నిలబెట్టారు' అన్నాడు పంతులు.

కోర్టులో భయంకరమైన నిశ్శబ్దం ఆవరించింది. గుండుసూది నేలనపడ్డ ఆ చప్పుడు వినిపించేటంత నిశ్శబ్దం అది.

'మరయితే ఆ పిల్లవాడు ఏమై పోయాడు? పిచ్చిదాన్ని చూసినచోట రక్తం గుడ్డ లెలావచ్చాయి ?' అన్న ప్రశ్నలు ఎవరూ అడగకపోయినా గాలిలో కదలాడాయి. శాంత చిట్టి పంతులుకేసి చూసింది.

'నిన్న నంతా నేను నిందితురాలైన సరళతో గడిపాను. మానసికంగా బలహీనురాలైందే గాని సరళ పిచ్చిదికాలేదు. పిచ్చిదానిగా బతికేయడంలో సుఖముందని గ్రహించి అలాగే కాలం వెళ్లబుచ్చింది. కాని హత్య చేసిందంటే అది నమ్మలేని విషయం. నేను సరళని అడిగాను.

డాక్టరుగారితోటి లాయరుగారితోటి చెప్పి [illegible]

హత్యానేరం మోపినందుకు కాక పిల్లవాడు కనబడనందుకు కుమిలిపోతున్న ఆ అమాయికురాలు హత్య చేసిందని ఎలా ఊహించారో ఆశ్చర్యంగా ఉంది. ఉదయంనుంచి ప్రతిమాలగా చిన్నచిన్నసంగతులన్నీ జ్ఞాపకం చేయగా ఈ సంగతి తేలింది.' అంటూ చెప్పసాగాడు పంతులు.

'సరళా బాబు ఎందుకు పారిపోయాడంటావు?' అడిగాను.

'ఏమో, తనేది అడిగితే అదల్లా తెచ్చియిచ్చాను. అయినా నన్ను వదిలిపోయాడు.' బావురుమని ఏడ్చింది సరళ.

'అసలేం జరిగింది? నువ్వు ఎక్కడికీ వెళ్లకూడదన్నావా?'

'లేదు లేదు. వాడే తనక్కడ ఉన్నట్టు ఎవరికీ చెప్పద్దన్నాడు. చెప్తే, నాతో చెప్పకుండా పారిపోతానని బెదిరించాడు కూడా. అందుకే ఎవరికీ, చెప్పలేదు. పిచ్చిబాబు. కాలికి దెబ్బకూడా తగిలింది. సరిగ్గా నడవలేకుండా ఉన్నాడు నా చేతులు విరిగిపోను! వీటి మూలాన్నే దెబ్బ తగిలింది' అని చేతులతో నుదుట బాదుకోడం మొదలు పెట్టింది.

'ఎందుకు దెబ్బ తగిలింది నువ్వు కొట్టావా?' అడిగాను.

'నేనా? బాబుని కొట్టడమా? లేదు. ఆవేళ ఉదయంనుంచి చితచిత లాడుతుంది. పట్టిన ముసురు వదిలేలా లేదు. పాకవి మట్టిగోడలు, ఒకటే కారడం. లోపల కూడా కూర్చుందుకు పొడిచోటు లేకుండా పోయింది.

[illegible]

అన్నాడు.

'అలాగే' అని ఒక డబ్బా ఇనప కంబీ ఒకటి తీశాను. కాని అంతట్లోనే మనసు మార్చుకున్నాడు.

'ఇప్పుడు వెడితే ఎవరేనా చూస్తారు. రాత్రిగా వెడదాం' అన్నాడు. సరే నన్నాను.

బాగా రాత్రి అయిపోయింది. చినుకులు తగ్గాయిగాని మేఘాలు విడలేదు.

ఆ చీకట్లో మట్టి తవ్వి తెద్దాం అని బయలుదేరాం.

నేను డబ్బా పట్టుకున్నాను. బాబు కంబీ పట్టుకున్నాడు. చెట్ల వెనకనుంచి ఆ బురదా రొచ్చులో నడిచి పోయాం.

'ఇంత ముందుకిపోవద్దు బాబూ. ఆ ఇళ్ల వాళ్లు చూస్తారు' అన్నాను.

'ఇక్కడేం ఎక్కువ ఇళ్లు లేవుగా? ఫరవా లేదు. అదిగో అక్కడ తవ్వి తెద్దాం' అని ఇంకో పది అడుగులు ముందుకి నడిచాడు.

నాకు భయంగానే ఉంది. ఎదురు పక్క రెండుమూడిళ్లు ఉన్నాయి. ఎవరేనా చూస్తే రభస. నెమ్మదిగా అదే అన్నాను వాడితో.

'నీకేం ఫరవాలేదు నే తవ్వుతాను నువ్వెళ్లి ఈమట్టిపాకలో పోసేసిరా' అన్నాడు.

అలా రెండుమూడు డబ్బాల మన్ను తీసుకువెళ్లి పోసి వచ్చాను. అంత చలిలోనూ బాబు నుదుట చెమటపట్టింది. తవ్వి అలసి పోయాడు. పాపం. 'బాబూ కాస్సేపు నేను తవ్వుతాను తే' అన్నాను. సరే అని కంబీ నాకు అందించాడు. రెండుమూడు పొర్లు తవ్వానో లేదో ఆ ఇనపకంబీ వాడి కాలి మీద వేసి కొట్టాను. ఖలంగా పడింది. పాపం గిలగిల్లాడి పోయాడు. ఒక్క అరుపు అరిచాడు కూడా. ఇంతట్లోనే జ్ఞాపకం వచ్చి నోరు నొక్కుకున్నాడు. వాడి చొక్కా కుంచే గుడ్డపేలిక చింపి కాలికి చుట్టు కున్నాడు. అంతే మట్టి లేదు. ఏం లేదు.

ఆదరా బాదరాగా పాకకి వచ్చేశాం. కాలి మీద బాగానే దెబ్బ తగిలింది. చుట్ట పెట్టిన గుడ్డ పేలిక ఎక్కడో రాలిపోవ డంతో కాలంతా బురద అయిపోయింది. కాలిమీద దెబ్బకడిగి పాత బట్ట కట్టు కట్టాను. ఏడవనైనా ఏడవలేదు. కుర్ర కుంక. గట్టిగా ఏడిస్తే తమన్నట్టు తెలిసి పోతుందని ఎంతో బాధ ఓర్చుకున్నాడు ... వారందాకా ఆ దెబ్బ నయంకాలేదు. ఇంకా కుంటుతూనే ఉన్నాడు. మరి ఎక్కడికి వెళ్లి పోయాడో. ఆ కాదంటావా ?' ఎంతో బాధ నిండిన గొంతుతో అడిగింది సరళ.

'మరి వాడినేగా మన్ను హత్య చేశావు అంటున్నారు?'

'ఏమైనా అనుకోనీ. నన్నేం చేసినా ఫరవా లేదు. బాబు తిరిగివస్తే చాలు' అంది;

'అదికాదు సరళా, నువ్వు కుర్రాణ్ణి ఏం చెయ్యలేదుకదా ? మరి ఎందుకు పారి పోయాడు?' అడిగాను. అమాయకంగా చూసింది సరళ.

'అదే నాకూ అర్థంకావడంలేదు...భగ్గో



మూడు వాడు అడిగాడని వంచి తెచ్చాను దాని పెట్టాను' అంటూ మంచంమీదున్న గుడ్డల మూట విప్పి పుస్తకాలు వంచీపైకి తీసింది సరళ.

అప్పట్లో ఆ దృశ్యం చూసి నాకంట నీరు కారింది. కాని సరళ జీవితంలో ఇంతకంటె దారుణ దృశ్యాలు ఉన్నాయి. అందుకే కర్తవ్యం మరిచిపోలేదు నేను.

'అయితే ఈసంగతి కోర్టులో చెప్తావా?' అడిగాను.

'ఎందుకు? నీకు చెప్పానుగా? అందరికీ ఎందుకు చెప్పడం?' అడిగింది.

పసివాళ్ల అమాయకత్వానికి ప్రతిబింబం లాంటి ఆ ప్రశ్నకి ఏం సమాధానం చెప్పాలి?

'అలాకాదు సరళా, నువ్వు చెయ్యని నేరానికి తల ఒగ్గడం ఎందుకు? ఇదేదో తేలిపోయాక బాబుకోసం స్వేచ్ఛగా వెతుకుదాం ఏమంటావు?' అడిగాను.

'అదీ బాగుంది. అలాగే చెప్తాను. కాని రేపేవెళ్లి వెతుకుతావా?' ఆత్రంగా అడిగింది.

'అలాగే తప్పకుండాను కాని సరళా, నాకొక్కమాట ఇవ్వాలి' అని అడిగాను.

'ఏమిటి?'

'ఈసారి నువ్వు నాతో వచ్చితీరాలి. అందుకు ఒప్పుకుంటేనే బాబుకోసం వెతకడం' అన్నాను.

'ఎక్కడికి?' అంది ఆశ్చర్యంగా.

'ఎన్నాళ్ళిలా గడుపుతావు? ఎందుకని? నువ్వు తిరిగి మామూలు మనిషివి అయితే తప్పించి లాభంలేదు' అంటూ తల నిమిరాను. ఆమె తలవంచి చంటిపిల్లలా ఏడ్చింది.

ఆ ఏడుపుకి అర్థం లేదు.

హృదయంలో పేరుకొన్న దుఃఖం కడిగేసుకోడానికా అన్నట్టు ఏడ్చిన ఏడుపు అది.

కోర్టువారు పరీక్షించి తేల్చుకోవచ్చు. సరళను గురించి నాకు తెలిసినంత చెప్పాను. మీ అనుమానాలు ఆమెనే ప్రశ్నించి తెలుసుకోవచ్చు ఆమె మాట్లాడుతుంది. అందుకు ఒప్పుకుంది' అని ఊరుకున్నాడు పంతులు.

'ఒక్క ప్రశ్న' అంటూ ఎదుటి న్యాయవాది లేచాడు.

'ఏమిటి క్రాస్ పరీక్ష చేస్తాడు కాబోలు. ఈ కరుణామయిగాథలో కల్పన కనిపించదే' అనుకుంది శాంత.

'నిరభ్యంతరంగా అడగవచ్చు. కాని సాక్షి చెప్పిన దీనగాథ మానవత్వాన్ని మేల్కొల్పేది. దాంట్లో కల్పించినది గాని సాక్ష్యం కోసం సృష్టించినది గాని లేదని మా నమ్మకం' అని కూర్చుంది లాయరు శాంత.

# ఆడది

'ఇంత వివరంగా చెప్పిన ఈ కథలో ప్రముఖ పాత్రధారి అయిన 'అతను' అనే వ్యక్తి పేరు పైకి రాకపోవడం బాగులేదు. అతగాణ్ని పిలిపించి విచారణ చేయించాలని మా కోర్కె. ఎవరా అతను?' అడిగాడు ఎదుటి లాయరు.

బోనులో నిలబడ్డ పంతులు తటపటాయించాడు.

'మీకు అభ్యంతరంగా తోస్తే సమాధానంచెప్పడానికి నిరాకరించవచ్చు'సూచించాడు.

'నాకేం అభ్యంతరం లేదు. ఆమె కథలో అతనుగానే ఉండిపోయిన వ్యక్తిని నేనే' అన్నాడు పంతులు.

ప్రశాంతంగా ఉన్న సరస్సులో రాయి విసిరితే ఏమవుతుంది? అలల వలయాలు అనంతంగా లేస్తాయి. ప్రశాంత వాతావరణంలో ఎవరయినా తుపాకి పేలుస్తే ఏమవుతుంది? గోలగోలగా పక్షులన్నీ ఒక్కసారి ఎగురుతాయి.

పంతులు సమాధానం విని కోర్టులో అంతే అయింది. ఒక్కుమ్మడిని అంతా గుసగుస మాట్లాడడం ప్రారంభించారు. రెండుసార్లు హెచ్చరించినా ప్రేక్షకుల గోల సద్దుమణగ లేదు.

కాలాతీతం కూడా కావడంతో కేసు వాయిదా పడింది.

అన్నట్టు తీసుకు వెళ్లడానికి పోలీసు వాను సిద్ధంగా ఉంది. ఒంటి నిండా కొంగు కప్పుకుని బండి ఎక్కడానికి సిద్ధపడుతూ లాయరుకేసి చూసింది సరళ. పక్కనే డాక్టరు కల్యాణి కూడా ఉంది.

'ఇంకొక్కరోజు రేపటితో అంతా తేలిపోతుంది.' అని సరళ భుజంతట్టి ధైర్యం చెప్పింది శాంత.

'నే ఊళ్లోనే ఉంటాను సరళా. రేపు ఉదయం మళ్లీ వచ్చి చూస్తాను. సరేనా?' దగ్గిరకి వెడుతూ అన్నాడు పంతులు. అప్పటిదాకా ఉగ్గబట్టుకున్న దుఃఖం కట్టలుతెగింది.

అతనిచేయి నొక్కుతూ మారుమాట్లాడకుండా బండిలోకి ఎక్కి కూర్చుంది సరళ...

'గట్టివాడే! నాతోకూడా ఈ సంగతి చెప్పలేదేం?' అంది సరళకి పంతులు ఇంత సన్నిహితుడని ఊహించలేక పోయినందుకు ఆశ్చర్యపడ్డ లాయరు శాంత.

'ఆ సంగతి [illegible]

అల్లాననీ అనుకుంటారు. అందుకే చెప్పలేదు. మీకు ఇంకో సంగతికూడా చెప్పలేదు —' ఆగాడు పంతులు.

'పోనీ ఇప్పుడు చెప్పండి' అంది శాంత కోర్టు ఆవరణదాటి వస్తూ.

'ఏం లేదు ఈ సరళ తాతగారే నరసింహంగారు' నెమ్మదిగా అన్నాడు పంతులు.

'వాట్? మేం కలిసిన కోవెల ధర్మకర్తగారా?'

'అవును అసలా రోజు నేను చాలా త్వరగా తుని నుంచి తిరిగివచ్చాను. దానికి కారణం ఉంది. నేను అలా రావడం నా కోసం మీరు వేచి ఉండడం దైవికంగా జరిగింది. ఆ రోజే తునిలో తెలిసింది. ఒక పిచ్చిదాన్ని హత్యానేరం మీద అరెస్టు చేసి తీసుకు వెళ్లారని. తరువాత వాకబు చేస్తే తెలిసింది ఆ వ్యక్తి సరళేనని. ఏం చెయ్యడానికీ పాలుపోలేదు. అప్పటిదాకా తాతగారికి సరళ సంగతి తెలియదు. ఆయన సర్వసంగపరిత్యాగి అయి కాలక్షేపం చేస్తున్నాడు. సరళ పిచ్చిదిగా తిరుగుతోందనిగాని, అడపా తడపా నేనామెను కలుసుకుంటున్నాననిగాని ఆయనకి తెలియదు. నేనూ చెప్పలేదు. తీరా చెప్తే ఏం జరుగుతుందో కొంచెం ఊహించగల్గాను. తాతగారు ఎలాగయినా సరళను తీసుకురమ్మంటారు. ఈ సంగతి తాతగారికి తెలిసిన ఎవరేనా ఊహిస్తారు. ఆయన అంత పట్టుదలకల మనిషి. సరళ ఇది తప్పించుకుందుకు ఎక్కడికేనా దూరంగా వెళ్లిపోతుందేమో అని నా భయం. అందుకే ఇప్పటిదాకా ఈ సంగతి ఆయనకి చెప్పలేదు. ఈ సంగతి తెలిసి నేను తిన్నగా వచ్చేశాను ఆ వేళ. మీరు నా కోసం ఎదురు చూస్తున్నారు. మీలాంటి సహృదయులు ఈ కేసు చేపట్టి పట్టిగాని లేకుంటే సరళ గతి ఏమై ఉండేదో.'

'కాని కేసు చేపట్టడం ముఖ్యంగా డాక్టరు కల్యాణివల్ల. కల్యాణి వృత్తిరీత్యా డాక్టరేగాని అందరు డాక్టర్లలాగా ప్రాక్టీస్ చేయడమే ధ్యేయం కాదు. పేషెంట్ల మనస్తత్వ పరిశీలన కూడా ముఖ్యంగా భావిస్తుంది.' అంది స్నేహితురాలి భుజం మీద చేయి వేస్తూ.

'మీ ఇద్దరూ కూడా చాలా అరుదైన వ్యక్తులు' అన్నాడు చేతులు జోడిస్తూ.

'మళ్లీ రేపు కలుద్దాం' అంటూ ఎవరి దారిన వారు యింటి ముఖం పట్టారు.

(ఇంకా ఉంది)

(ఛ) [illegible]

[illegible] అడ్డం 4, నిలువు 5 గదులు ఉన్న చదరంగపు బల్లను నేలమీద గీసి, ఒక వైపున నాలుగు నల్ల శకటులు, రెండో వైపున నాలుగు తెల్ల శకటులు బొమ్మలో చూపినట్లు అమర్చు ఇప్పుడు చేయవలసిన దేమిటంటే నల్ల శకట్లు, తెల్ల శకట్ల

| | | | |
|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 |
| 5 | 6 | 7 | 8 |
| 9 | 10 | 11 | 12 |
| 13 | 14 | 15 | 16 |
| 17 | 18 | 19 | 20 |

స్థానాలు తారుమారు కావాలి. ఒకసారి నల్ల శకటును కదపాలి. తరువాత తెల్ల శకటును కదపాలి ఒక రంగు శకట్లు మరో రంగు శకట్లు కాచే దారిలో నిలువబడ కూడదు. ఈ తారుమారును సాధ్యమైనన్ని తక్కువ ఎత్తులలో వేయడానికి ప్రయత్నించు చూద్దాం.

* * *

(చ) తెలివైన సాలీడు:

30 అడుగులు × 12 అడుగులు × 12 అడుగులు కొలతలు గల గదిలో ఒక సాలీడు కాపురం ఉంటోంది. ఒకరోజున దానికి ఆకలిగా ఉండి ఆహారం ఏదైనా దొరుకుతుందేమోనని అటూ ఇటూ పరకాయించి చూస్తున్న సమయంలో ఒక ఈగ కనిపించింది దాని మీదికి వెళ్లి పడిపోదామన్న ఆవేశాన్ని కాస్త అణుచుకుని పరిస్థితులను జాగ్రత్తగా పరిశీలించి చూసింది 12 అ॥ × 12 అ॥ గోడలలో ఒక దాని మీద గోడకు మధ్యగా పైకప్పుకి ఒక

## తెలివైన సాలీడు



అడుగు కిందుగా దాను ఉంది. సరిగ్గా ఎదుటి గోడమీద సరిగ్గా నేలమీద నుంచి ఒక అడుగు పైన ఆ ఈగ ఉంది. అన్నింటి కన్న దగ్గర దారిలో పాకి వెళ్లి ఈగను పట్టేసింది ఆ తెలివైన సాలీడు




ఇంతకీ ఆ సాలీడు ప్రయాణం చేసిన దారి ఏది? (అది కాళ్లతో నడవడమేగాని పైనుంచి జారడం, ఎగిరి గంతువెయ్యడం వంటి పనులు చెయ్యలేదు.)

(జ) నాలుగు రెళ్లు:

2 అనే అంకెను రెండుసార్లు ఉపయోగించి $2^2$, 22 అనే రెండు సంఖ్యలను తయారుచేయవచ్చు. ఈ రెంటింటిలోకీ పెద్దది 22. (ఏమంటే $2^2$=4 కనుక)

2 అనే అంకెను మూడుసార్లు ఉపయోగించి వ్రాయదగ్గ గరిష్ఠ సంఖ్య ఏది?

అల్లాగే 2 అనే అంకెను నాలుగుసార్లు ఉపయోగించి వ్రాయదగ్గ సంఖ్యలలో అన్నింటికన్న పెద్దది ఏది?

* * *

(ఝ) తప్పుడు గడియారాలు:

కామేశ్వరరావు, చలపతి 8 గంటల మెయిలుకి వెళ్లాలనీ, బండి బయలు దేరడానికి 5 నిమిషాలు ముందుగా స్టేషనుకి రావాలనీ నిర్ణయించుకున్నారు.

కామేశ్వరరావు తన వాచీ 25 నిమిషాలు ముందర ఉందనుకున్నాడు. కాని, నిజానికి 10 నిమిషాలు వెనక తిరుగుతోంది. చలపతి తన వాచీ 10 ని॥ స్లో అనుకున్నాడు. నిజానికి అది 5 ని॥ ఎదర ఉంది.

ఆ ఇద్దరూ తమ తమ వాచీలను నమ్ముకుంటే స్టేషనుకి ఎప్పుడు చేరుకుంటారు?

## తప్పుడు గడియారాలు



## మెదడుకి మేత



డాక్టర్ మహీధర నళినీమోహన్

| | తెలుపు శకటం | నలుపు శకటం |
|---|---|---|
| 1. | 18-15 | 3- 6 |
| 2. | 17- 8 | 4-13 |
| 3. | 19-14 | 2- 7 |
| 4. | 15- 5 | 6-16 |
| 5. | 8- 3 | 13 18 |
| 6. | 14- 9 | 7-12 |
| 7. | 5-10 | 16-11 |
| 8. | 9 19 | 12- 2 |
| 9. | 10- 4 | 11-17 |
| 10. | 20-10 | 1-11 |
| 11. | 3- 8 | 18-12 |
| 12. | 10-13 | 11- 8 |
| 13. | 19- 6 | 2- 5 |
| 14. | 16- 1 | 5-20 |
| 15. | 9- 6 | 12-15 |
| 16. | 13- 7 | 8-14 |
| 17. | 6- 3 | 15-18 |
| 18. | 7- 2 | 14-19 |

ఈ విధంగా 18 ఎత్తులతో ఈ సమస్యను సాధించవచ్చు.

*　*　*

(వ)

ఈ సమస్యను సాధించడానికి ముందుగా ఆ గదిని పోలిన అట్టపెట్టె నొకదానిని ఊహించుకుందాం. ఆ పెట్టె 6 అట్టలతో ఏర్పడి ఉంటుంది. ఈ అట్టలను బందులతో ఒకదానికొకటి అతికించామనీ, అవసరమైనప్పుడు ఆ బందులు వదులుచేసి, అన్ని అట్టలనూ నేలమీద పరిచెయ్యడానికి వీలుగా ఉందనీ అనుకుందాం. ఆ పెట్టెను నేలమీద పరిచేసి, సాలీడు నుంచి ఈగకు ఒక సరళ రేఖను గీస్తే అదే దగ్గర దారి అవుతుంది. కాని, బందులు విడదీసే పద్ధతినిబట్టి చాలా రకాలుగా ఆ అట్టలను నేలమీద పరచవచ్చును. ఇక్కడి బొమ్మలో నాలుగు పద్ధతులు చూపించాను. సాలీడుకీ ఈగకీ మధ్య దూరం ఆ నాలుగు పద్ధతుల్లోనూ వరుసగా 42 అ॥, 43.2 అ॥,








40.7 అ॥, 40 అ॥ ఉంటుంది. అన్నింటి కన్న తక్కువ దూరం (40 అడుగులు) నాలుగవ పద్ధతిలోనే సాధ్యం. ఇదే సాలీడు పోయిన దారి.

*　*　*

(ట) 2 అనే అంకెను మూడుసార్లు ఉపయోగించి ఈ క్రింది సంఖ్యలను వ్రాయవచ్చు.

222, $22^2 = 484$

$2^{22} = 4194304$, $2^{2^2} = 16$

కనుక మూడు రెళ్లతో వ్రాయదగిన గరిష్ఠ సంఖ్య $2^{22}$.

అల్లాగే 2 ను నాలుగుసార్లు ఉపయోగించి ఈ క్రింది సంఖ్యలను వ్రాయవచ్చు. వాటి విలువలు (సుమారుగా) ఆ సంఖ్యలకు ఎదురుగా వ్రాద్దాం.

$$2222 = 10^3$$
$$222^2 = 10^4$$
$$2^{2^{2^2}} = 10^5$$
$$22^{22} = 10^{29}$$
$$2^{222} = 10^{67}$$
$$2^{22^2} = 10^{145}$$
$$2^{2^{22}} = 10^{12.60.000}$$

కోటి అంటే $10^7$ మాత్రమే. కోటి కోట్లు అంటే $10^{14}$ మాత్రమే. వీటితో పోల్చి ఈ సంఖ్యలు ఎంత పెద్దవో ఊహించుకోండి.

(త) కామేశ్వరరావు గం. 8.30 కి చలపతి గం. 7.40 కి స్టేషనుకి చేరుకుంటారు. ●



గుండె
జలుబును
వెంటనే
పోగొట్టుకోండి

# అమృతాంజనం

## పైనేరాసి త్వరగా గుణాన్ని పొందండి

అమృతాంజన్ బాధా నివారిణి నిరపాయకరంగా శీఘ్రంగా గొంతు జలుబుకీ సాధారణ జలుబులకు అమోఘంగా గుణాన్ని కల్గించడానికి 10 రకాల ఔషధాలు చేరిన మందు. తలనొప్పులకు, ఒళ్ళునొప్పికి, బెణుకులకు కూడా అమృతాంజన్ అమోఘంగా పనిచేస్తుంది. కొంచెం కొంచెమే ఉపయోగించవలసి ఉంటుంది కాబట్టి ఒక సీసా నెలల తరబడి వస్తుంది మీ కుటుంబానికంతా. అవసరానికెప్పుడూ అందుబాటుగా అమృతాంజన్ ఉంచుకోండి. అమృతాంజన్ 70 ఏళ్ల ప్రసిద్ధి పొందిన నమ్మకమైన గృహ ఔషధం.

అమృతాంజన్ నొప్పుల జలుబుల నివారణకు 10 రకాల ఔషధాలు చేరిన మందు

అమృతాంజన్ లిమిటెడ్, మద్రాసు - బొంబాయి - కలకత్తా - ఢిల్లీ



# బ్రిటిష్ యువకుల ఆధ్యాత్మిక చింతన

ఆధ్యాత్మిక చింతనపట్ల యీ అణుయుగంలో కూడా పశ్చిమదేశాలలో శ్రద్ధాసక్తులెక్కువవుతున్నయ్. రేపోమాపో మానవుడు చంద్రగోళంలో కాలిడబోతున్న తరుణంలో బ్రిటిష్ బీటిల్స్‌లో ముగ్గురు యువకులు కాశ్మీర్ యోగి ఆధ్యాత్మిక పునర్జన్మోద్యమం నాయకుడు మహర్షి మహేశ్ యోగి శిష్యులయినారు.

అగస్టు 24 వ తేదీ లండన్ నగరంలోని హిల్టన్ హోటల్ నృత్యమందిరంలో మహర్షి మహేశ్ యోగి తెల్లటి ఉడుపులతో, రెండు చేతులలోనూ రెండు ఎర్ర గులాబీలతో పద్మాసనాశీనులయినారు. లోకాతీతానుభవం గురించిన వారి ప్రసంగం వినేందుకు 1,500 మంది వచ్చారు. ఒక యోగి చేసే ఆధ్యాత్మికోపన్యాసం వినే నిమిత్తం యింతమంది శ్రోతలు చేరడంలో వింత యేమిటనిపించవచ్చు. అందునా భారతీయ తాత్విక చింతన గురించి బ్రిటన్‌లో రకరకాల అద్భుతాభిప్రాయాలు చాలా సంవత్సరాలుగా ఉన్నవిగదా! కానీ 7 షిలింగుల 6 పెన్నీల టిక్కట్టు కొంటేనేగానీ యీ మందిరంలోకి ప్రవేశం లభించలేదని తెలుసుకుంటే, మహర్షి మహేశ్ యోగి శ్రోతలను ఎంతగా సమ్మోహితులను జేసినదీ విశదమవుతుంది. బ్రిటిష్ 'బీటిల్స్'లో ముగ్గురు పాల్‌మెక్ కార్ట్నీ, జాన్ లెనన్, జార్జి హారిసన్ కూడా వచ్చారు సభకు.

'మనశ్శాంతి, ఆత్మానందం, ఆత్మశక్తి'—ఇవి మహర్షి ప్రసంగం విన్న శ్రోతలు ఆపేక్షించిన బహుమతులు. ప్రసంగం విన్నంతమాత్రానవే యీ బహుమతులు లభించితే మరి మహర్షి ప్రబోధాలను ఆచరించే వారికి మరెన్ని బహుమతులు లభించుతవో గదా! వారి శిష్యులుగా చేరడానికి కొంత మూల్యం చెల్లించుకోవాలి. 'బీటిల్స్' మాటలలో ఒకవారం వేతనం చెల్లించాలి. మాత్ర సంబంధించినంతవరకూ ఇదేమంత తక్కువ మూల్యం కాదు.

ఇంత ఎక్కువ డబ్బు చెల్లించాలి గదా! ఎందుకొచ్చిన గొడవ? అనుకొని 'బీటిల్స్' మహర్షికో నమస్కారంపెట్టి తమ దోవన తాము వెళ్లారా? లేదు. ఆధ్యాత్మిక పునర్జన్మ విధానాన్ని తెలుసుకొనాలనే ఉత్సాహంలో ఈ ఖర్చును వారు లెక్కచెయ్యలేదు. జార్జి హారిసన్ ఇట్లా చెప్పారు. 'సత్యం తెలుసుకోవాలనే యీ రాత్రి ఇక్కడికి వచ్చాము. మహర్షి ప్రబోధాలను చాలా కాలంగా వింటున్నాము.'

ప్రసంగం పూర్తయిన తరువాత బీటిల్స్‌ను మహర్షికి పరిచయం చేశారు. మహర్షి ఇట్లా చెప్పారు. 'మీ పేరులో ఒక మంత్ర దండమును సృష్టించారు. సత్ఫలితాలిచ్చేవిధంగా మంత్రదండమును మీరు ఉపయోగించాలి. ఇది మీ బాధ్యత.'

1,500 మంది రెండుగంటలసేపు మహర్షి ప్రసంగాన్ని విన్నారు. ఇంతకూ మహర్షి చెప్పేదేమిటి? 'ప్రతిమనిషిలోనూ అంతరశక్తి ఉన్నది. సాధారణంగా ప్రకటితం కాదు. అన్వేషించి, సాధించి, స్వాధీనం చేసుకోవాలి. నిశ్చల చింతనద్వారా యీ శక్తిని సాధించి చిదానందానుభూతిని పొందవచ్చు.'

ప్రసంగం తరువాత సభికులందరూ అయిదునిమిషాలు మౌనంగా కూర్చున్నారు. ఆ తరువాత బీటిల్స్ ప్రత్యేకంగా మహర్షిని కలుసుకున్నారు. ఆటుతరువాత ఇట్లా చెప్పారు: 'ఆనందానికి కీలకం మనస్సులోనే ఉన్నదని తెలుసుకున్నాము.'

'అట్టి అతీతానుభవం పొందిన తరువాత వాస్తవ లోకంలోకి దిగిరావడానికి కొంత వ్యవధి పడుతుంది' అన్నాడు జాన్.

'చాలా సంభ్రమం కలిగించిన అనుభవాలలో ఇదొకటి' అన్నాడు పాల్.

సరే ఇంతకూ వీరు చెప్పిన అనుభవం యొక్క స్వరూప స్వభావాలేమిటి? సభకు ముందు తెరవెనుక వీరు ముగ్గురూ మహర్షి ప్రబోధం వింటూ 1 గంటసేపు పద్మాసనాశీనులైనారు. అప్పుడే— ఆ క్షణంలోనే వారికి లోకాతీతానుభవం కలిగినది.

—వి. ఎస్. అవధాని



# వర్షంలో మనిషి

వి.యస్.భారతీమూర్తి



పొడుగాటి నీడలు పరుచుకుంటూ పోతున్నది సాయంత్రం.

రోడ్డుకు వారగా, జనసమూహంలో ఒంటరిగా చలపతి. ఆలోచన మోస్తున్న తల బరువుగా వంగింది. నీరసాన్నిమోస్తున్న కాళ్లు నింపాదిగా నడుస్తున్నాయి. బుగ్గలు — చిన్నప్పుడు పక్కింట్లో పడుచుదనం పొడుచుకొస్తున్న కుర్రది 'కరివేపాకు కోసియ్యవూ చలపతీ!' అని పిలిచి గట్టిగా, బలంగా, ఆబగా వత్తి ముద్దు పెట్టుకునే వాటిలాకాక గాలిపోయిన రబ్బరు బుడగల్లా చప్పబడి పోయాయి. కళ్లు — అదృష్టహీనుడి సంతోషదివాల్లా వెనక్కి వెళ్తున్నాయి. కనుబొమ్మల వసారాల్లో లోలోపలం దాక్కుంటున్నాయి. భుజాలు బరువుతో వాలినట్లున్నాయి.

'ఓ జన్మలో చేసిన కర్మఫలం మరో జన్మలో అనుభవిస్తారని కదా అంటారు. పోయిన జన్మలో ఎటువంటి పాపం చేస్తే యీ జన్మలో మనిషి నయ్యానా!' అని ఆశ్చర్యపోతుంటాడు చలపతి. ఈ ఆశ్చర్యం యీనాటిదీ నిన్నటిదీ కాదు. చలపతికి సుమారు ముప్ఫయ్యేళ్లొచ్చిం దగ్గర్నుంచీ అతనితో వుంటోంది. దాని తోడువలన ఒంటరితనం అదేదేంటో ఎరక్కుండా వున్నాడు అతను.

చలపతి ప్రశ్నకు జవాబులా దబారంగా జరుగుతున్నది సాయంకాలం. వెంట తెచ్చిన నీరెండలో అతని నీడ. స్వతంత్రానికి ప్రతినిధుల్లా ఆకాశంలో రెక్కలార్చుకుంటూ వెళ్తున్న పక్షులు.

తూర్పు దిక్కునుంచి నల్లటి మబ్బులు ప్రాక్కొస్తున్నాయి. చిన్నప్పుడు — ఆరేడేళ్ల వయసునాడు — యిలాంటి మబ్బుల్ని చూసి 'వానా వానా వెల్లప్ప' ఆడుకునేవాడు ఈ పెడా ఆ పెడా వుండే కుర్రవాళ్లతో కూడి. కాలేజీ చదువు వయసొచ్చేసరికి — ఇంటర్మీడియట్ ఫేలయ్యేనాటికి — యిలాంటి మబ్బుల్ని చూస్తే ఏదో తియ్యనిబాధతో

ఊహాతీత ఊహాలతో ఉక్కిరి బిక్కిరి అయ్యే వాడు. తన మేనకోడలు రమాదేవిని—ఆ అమ్మాయిని ప్రేమించాననుకునేవాడు చలపతి—ఒంటరిగా ఏదో జలపాతాలున్న ప్రాంతానికి తీసుకువెళ్లి ఒళ్లో పడుక్కోబెట్టుకుని మేఘసందేశంలాంటి సాహిత్యం చెప్పాలని అనుకునేవాడు. ఆ రమాదేవి భార్య అయింతర్వాత—అంటే రామి అయింతర్వాత—ఏడాదిదాకా క్రొత్తగా చేరిన ఉద్యోగం తాలూకు పని మూలాన ఎప్పుడూ తీరికే కుదిరిందికాదు. ఏదో రాత్రిళ్లు పక్కలో చేరినప్పుడు నిద్రబరువుతో వాలిపోతున్న కళ్ల మధ్యనుండి అందిన చూపులో అందంకన్నా ఆవేశం ఎక్కువగా కనబడేది. ఏడాది తిరక్కముందే ఆవిడకి బాబీ పుట్టడంతో ఊపిరి సలిపేదికాదు. మేఘాలు—వాటిలో సందేశాలు యిప్పుడు చలపతికి అందకుండా వయసు కుర్రాళ్ల పాకిళ్ల నాశ్రయించుకుంటున్నాయి. బహుశః వాళ్ల బాబీని—వాడి తర్వాత పుట్టిన లక్ష్మీదేవిని (యింకా ఎక్కడి లక్ష్మీదేవి?)—ఆ తర్వాత కన్న బిట్టి తల్లిని ఆశ్రయించుకుంటున్నాయేమో! ఈ రోజున యిదే మేఘాలు చూసి గొడుగు కూడా కొనుక్కోలేదే యిన్నేళ్ల జీవితంలోనూ అని చింతపడ్డానికి కూడా ఓపికలేక స్తబ్ధుగా నడిచిపోతున్నాడు చలపతి.

మేఘాలు చినుకులై నేలమీద రాలుతున్నాయి నక్షత్రం పువ్వుల్లాగా! గొడుగులున్నవాళ్లు ఒడుపుగా వ్యాయామం చేస్తున్నారు వానకు నేస్తంగావచ్చిన గాలివిసురుకు నిలబడ్డం కోసం. బోలెడుమంది జనం గోడవారుకూ, కొంపల వసారాల్లోకి, చెట్ల నీడల్లోకీ (ఈ మున్సిపాలిటీ రోజుల్లో చెట్లు ఎక్కువగా ఎక్కడున్నాయిలెండి!) తప్పుకుంటున్నారు. చలపతికి తప్పుకోవాలని అనిపించలేదు ఎందుకనో! అతని పక్కనే నడుస్తున్న ఎద్దుకూడా వర్షంలోంచి తప్పుకోలేదు!

పగలంతా బండిక్కట్టిన గుర్రంలా అలసిపోయి, సాయంత్రంవేళ కాసేపు గాలి పీల్చుకుందామని బయటపడితే వానకూడా పడాలా అదేసమయానికి. జనానికి విసుగ్గావుంది యీ తంతు.

'ఏమిటయ్యా వెధవ బ్రతుకు మనిషి జన్మెత్తాక బ్రతికితే ఏ నైజాంలాగానో, తాతాలాగానో, ఆఖరికి మన ఆఫీసు మేనేజరులాగానో బ్రతకాలిగానీ ఈ వర్షం బ్రతుకేమిటంట!'

'రెయిన్‌కోటు కొనుక్కునే తాహతులేదు గానీ నైజాంలాగా మేనేజరులా బ్రతుకుతాం!'

గోడపక్కకు చేరిన ఎవరో యిద్దరు చలపతులు—నడివయసువాళ్ల సంభాషణ చెవిని పడింది చలపతికి.

వాళ్లదగ్గర ఓక్షణం ఆగి మాట్లాడిపోతే బాగుండునని అనుకున్నాడు చలపతి. కానీ ఆగలేదు. అలా తడుస్తూనే పోతున్నాడు.

వర్షం—బరువుగా తడిగా జడిగా పడుతున్న నీళ్లవర్షం. జుట్టులోంచి మొహం మీదకు జారుతుంటే గొంగళిపురుగు నడిచినట్లున్న వర్షం.

రామి ఏమేమిటో తెమ్మని చెప్పింది యింట్లోనుంచి బయలుదేరేముందు. ఇంట్లో ఎదిగిన ఆడపిల్లలున్నట్లు, వాళ్లకు పౌడరు స్నో అవసరం వున్నట్లు రామి అంటూండే మాటలు గుర్తొచ్చాయి చలపతికి.

'అలా కాలేజీవైపు వెళ్లిరండి. ఆడపిల్లలు ఎంతగా ముస్తాబవుతుంటారో; వాళ్ల వేషాల ధోరణిలో ఎన్ని కొత్తకొత్త హంగులున్నాయో తెలుస్తుంది. ఇంట్లో పెళ్లికెదిగిన పిల్లలున్నారని మనసుకు పట్టించుకుంటే—కాస్త వాలుగుకాసులు వెనకేసుకొచ్చుంటే......' ఆ మాటలన్నీ మరీ మామూలైపోయాయి. మొదటిసారి విన్నప్పుడు ఏదో జవాబియ్యబోయి మాట్లాడ్డం ఆపి వూరుకున్నాడు. మరీ అస్తమానం అంటుంటే విసుగొచ్చి 'నోర్మూయ్' అనీ, 'చావు' అనీ పెళ్లాన్ని కసురుతాడు. మరీ పెద్రేగిపోతుంటే మొగుడు, పెద్దవాడూ అనే లెక్కలేకపోతుంటే చప్తాడు గనకనా! అసలే అసమర్థుడు,

డబ్బంటే హంగులు. ఆ సంగతి రామికి తెలీదు గనకనా; పీరిగాడు నారిగాడ్ని, నారిగాడు నోరిగాడ్ని అన్నట్లు పక్కవాడి మీద పారబోస్తే మన దుమ్ము కొంతైనా వదుల్తుంది. మన బరువు కాస్తైనా తగ్గుతుంది. ఏం చేస్తుందది? వాళ్లుదాన్ని దులుపుతుంటే, అది తన్ని...అసలే 'పోషించలేనివాళ్లు ఎందుక్కన్నారంట—పుట్టగానే చంపి పారేయాల్సింది' అని పిల్లలు తల్లినీ తండ్రిని ఎదురు తిరిగి కడిగేసే రోజులాయి యివి అని ఒకటి రెండుసార్లు జాలికూడా పడ్డాడు చలపతి......

వయసులో ఉన్నప్పుడోసారి వర్షం పడుతుంటే ఆ జల్లులు చూసి శోభనం గది మంచానికట్టిన మల్లెదండల్లా వున్నాయనుకున్నాడు చలపతి. యిప్పుడదే వర్షం చూస్తుంటే జైలు కటకటాల్లా ఉన్నాయనిపిస్తోంది...

నలభైనాలుగేళ్ల క్రితం, ఆముదం దీపం వెలుగులో ఓకాలు ఊగిసలాడుతున్న కుక్కిమంచం మంచంమీద పడుక్కొని 'గుమాస్తా ఉద్యోగం చేసుకు బ్రతుకు వాయనా — మీనాన్నలాగా వ్యవసాయం మాత్రం వద్దు' అని కనిపడేసింది చలపతిని వాళ్లమ్మ. పదేళ్లవయసులో ఓసారి కాలవలో యీదబోయి చేతకాక నీళ్లుతాగేసి వచ్చి పోవడానికి సిద్ధపడితే 'నీవాటా దౌర్భాగ్యం యిక్కడే వుందిరా చలపతీ!' అంటూ బ్రతికించాడు సిద్ధాంతి మందులు తినిపించి.

ఓసారి—వీధి చివర కలక్టరు గారబ్బాయి కొనుక్కున్న ఫారిన్ దొరసాని బొమ్మ చూసి కావాలని మారాం చేస్తే వాళ్ళు చితకబాది ప్రపంచంలో జనం ఎందుకు పుడ్తారో, వాళ్ల కర్మలంటే ఏమిటో, మొదలైన గాఢమైన జీవిత రహస్యాలు తెలియ చేశాడు వాళ్లనాన్న. కొందరు అసాములుగా పుడ్తారనీ, అది వాళ్ల పూర్వజన్మ సుకృతం అనీ—మరి కొందరు వాళ్లకు గులాములై పుట్టి సలాములు చేస్తూ బ్రతుకుతారనీ—ఇది సృష్టి రహస్యం అనీ, మరోజన్మలో మనమూ మహారాజులుగా పుట్టవచ్చనీ—భగవంతుడు యీ రకమైన బ్రతుకులు సృష్టించాడనీ అద్భుతమైన జ్ఞానబోధ చేశాడు ఆయన. అందుకనే కలక్టరుగారికి వాళ్లనాన్న గులామైతే వారబ్బాయికి చలపతి గులాంగా మసలడం నేర్చుకున్నాడు. గుమాస్తా జీవితంలో ఆవసరమైన ఓర్పు అదీ అనాడే సంపాదించి వుంచుకున్నాడు. అనాటి కలెక్టరు గారబ్బాయి ఈనాడు మేజిస్ట్రేటై న్యాయాన్ని పంచుతుంటే, చలపతి గుమాస్తాగా తన కుక్కి మంచంలోని నల్లులకి రక్తం పంచిపెడ్తున్నాడు.

చలపతి లాంటి గుమాస్తా స్టూడెంటు ప్రేమించడం విచిత్రమైన సంగతిలా అనిపిస్తుంది. అదేం లేదు, చలపతి ప్రేమించక ముందే రమాదేవి అతని భార్యగా అయిపోయింది. అంటే ఆమె పూర్వజన్మ

ముక్కృతం గుమాస్తా భార్యగా పుట్టమని ఆదేశించిందని అర్థం. తొలినాడు పలకరించుకున్నప్పుడు వాళ్ళిద్దరూ అలాగే అనుకున్నారు కూడా! అందుకనే రమాదేవి ఆరో క్లాసుతో చదువుమానేసి గరిట అందుకుంది చలపతి పరీక్ష అవడం మానేసి ఫైళ్లలో చేరిపోయాడు...

'దీని తంతు నాకేమిటో అంతు బట్టటం లేదండి. మొన్న ఆ మహాతల్లి పెళ్ళైన రెండవ రోజునుంచి అతిధోరణి మొదలు పెట్టింది. రెండురోజులు జ్వరం కాసిందో! ఇందాక మీరు వెళ్ళి నప్పటినుండి రెండు గంటలు కచేరీ చేసింది. ఏమిటో పిచ్చివాగుడు. చచ్చిపోతానంటుంది పరీక్ష ఫేలవలేదుట దాని పేపర్లు ఎవడో దొంగతనం చేసి పారిపోయాట్ట. 'నాన్న వట్టినాజమ్మ—వాడ్ని పట్టుకోనూ గూడా లేడు'... ఓ రోజు చలపతి యిల్లు చేరిన వెంటనే రామి చలపతి చెవిన వేసింది పిడుగులాంటి వార్త. రామి ప్రసంగంలో దొర్లిన మహాతల్లిదో వింత గొడవ. వాళ్ళనాన్న ఓ ఐదుగుర్ని కని పెద్ద వాళ్ళు ముగ్గురికి పెళ్ళిళ్ళుచేసి, చిన్న వాళ్ళనిద్దర్ని వదిలి—ఇద్దర్నూ 'మహాతల్లులే'—వాళ్ళకిద్దరికీ చెరో పదివేలూ ఆస్తి యిచ్చి చచ్చిపోయాడు. క్రితం సంవత్సరం చలపతి బామ్మరిది కామేశానికి యిద్దరు మహాతల్లుల్లో పెద్దావిడతో వివాహం జరిగే వరకూ వాళ్ళగురించి చలపతి కేమీ తెలిసింది కాదు. పెళ్ళయ్యే వరకు — స్వతంత్రంగా వున్నంతకాలం—అక్కచెల్లెళ్ళు కలిసేవున్నా పెళ్ళయ్యాక కొత్త బంధాల మధ్య చిన్న దానికి ఊపిరి సలపలేదు! చలపతికి గుమాస్తా మనస్తత్వం మాత్రమే గాక, పక్కింటి పడిపోతున్న చూరు బాగు చేయించడం — అంటే బయటి బురద వంటివి పులుముకోడం లాంటి పనులంటే మహా ఉత్సాహం—యింట్లో పుచ్చిపోతున్న వాసాల సంగతి అంతగా మనసుకు పట్టదు. ఈ రకంగా అనాథ అయిన ఆ బాలికకు—కాలికి బలపం కట్టుకుని — ఉద్యోగం సస్పెండు చేయించుకునే స్థితికి తెచ్చుకుని లొట్టపోయిన కంటితో ప్రాణం మిగుల్చుకుని—తిరిగి పెళ్ళి సంబంధం కుదిర్చి స్వయంగా వివాహ మహోత్సవం జరిపించాడు. ఆ పిల్ల డబ్బులో వాటా చిక్కించుకున్నాడు. కిట్టని వాళ్ళలాగే అంటూంటారనిపించింది. కిట్టని వాళ్ళెవరో కాదు ఆ మహాతల్లులూ వాళ్ళ బాగోగులు పట్టించుకున్న పాపానబోని అక్క, బావలూ మొదలయిన వారు.

చలపతి పెద్దకూతురూ, చిన్నకూతురూ ఒకేసారి స్కూల్ ఫైనల్ పరీక్ష వ్రాశారు. వాళ్ళు చదవడం చలపతి కొంతమాత్రం నచ్చిందికాదు. 'మన సంస్కారానికీ, సంప్రదాయానికీ ఆడపిల్లలు చదవడం పడదూ, చదివింతర్వాత వీళ్ళకీ, వీళ్ళని కట్టుకున్న మొగుళ్ళకీ ఉద్యోగాలు చెయ్యాలనీ, చేయించాలనీ పోయేకాలం బుద్ధిపుడుతుంది' అని చలపతికి నిశ్చయమైన అభిప్రాయం. అయినా పెద్దాడు బాబ్జీకి పోయేకాలం బుద్ధులు ఏనాడో వచ్చాయి. తండ్రి నెదిరించడం నేర్చుకున్నాడు. చలపతికంటే అతనిభార్యది కొంచెం ముందు చూపు. గుమాస్తా భార్యగా బ్రతకవలసిన దుర్గతి చదువుకుంటే పట్టేది కాదని ఆమె నమ్మకం. ఆమాట పైకి అన్నప్పుడల్లా ఆవేశపరుడైన చలపతి గట్టిగా అరుస్తాడు. ఇప్పుడిప్పుడే కొంచెం పిరికితనం పట్టుకుంది కానీ, లేకపోతే పులుసులోకి లేకుండా ఎముకలూ విరుస్తాడు. పరీక్ష రాసింతర్వాత పెద్దది తప్పికూర్చుంది. చిన్నది పరీక్ష అయింది. పెద్దదానికి నాన్న పోలిక లొచ్చాయని అంటూంటాడుకూడా తిరుగుబాటుదారుడైన బాబ్జీ!

పైన చలపతి భార్య చెప్పింది పరీక్ష తప్పిన కూతురు గురించే! ఓరోజు పరీక్ష తప్పిన దానికీ చలపతికీ పెద్ద వాగ్యుద్ధం జరిగిందికూడాను.

'ఏనాడైనా ముచ్చటగా సినిమాకైనా వెళ్ళమన్నావూ? వాళ్ళకీ వీళ్ళకీ మెహర్బానీగా పన్లు చెయ్యమంటే చేస్తావుగానీ, యింట్లోవాళ్ళు పీనుగుల్లా బ్రతుకుతున్నారే అన్న ఆలోచన నీకుందా అంట...' అంది లక్ష్మిదేవి.

చలపతి కంతగా వివేకంలేదని బంధువుల్లో అందరూ అనుకునేమాట! అందుకనే కాబోలు కూతురుతో సమానంగా రెచ్చిపోయాడు.

'నోర్మూయ్యవే; నోర్మూయ్యమంటున్నాను. పరీక్ష పాసవడం చేతకాదుగాని, తండ్రి నెదిరించమంటే తయారు. సిగ్గులేకపోతే సరి. ఏ నూతులోనో దూకిచస్తే బాగుంటుంది—యిలా చేతకాని బ్రతుకు బ్రతక్క—చావు ఒక్కసారి.'

'అవును! నన్ను చావమంటావు అనవూ? బ్రతికుంటే పెళ్ళి చెయ్యాలిగా...'

ఇలా సాగింది వాళ్ళ యుద్ధం అని ప్రక్కయిళ్ళవాళ్ళు, చలపతి పెళ్ళాంకూడా అనుకుంటూంటారు.

ఇదికాక—ఆ మహాతల్లి—పెళ్ళిసమయంలో వాళ్ళు వీళ్ళని ఏదో ఎద్దేవా చేశారని ఒక మాట. ఇవన్నీ కలిసి చలపతి మొదటి ఆడపంట లక్ష్మీదేవి బుర్ర చెరిచేశాయి. ఆ అమ్మాయి పిచ్చివాలకంతో యిల్లు గొల్లుమంటుండేది. ఆరునెల్ల క్రితంవరకూ, పన్నెండురోజులపాటు ఎవరో గురువుగారు పూజలు చేశాడు — ఏదో కామినీగ్రహం పట్టిందని— వారంరోజులపాటు యింగ్లీషు మందూ, పదిరోజులపాటు హోమియోపతీ మందూ వేసి చూశారు. పన్నెండూ, ఏడు, పదీ, ఇరవై తొమ్మిది రోజులయాక ముప్ఫయ్యోరోజున ఆయుర్వేదం వైద్యుడి దగ్గరకు తీసుకువెళ్దామని అనుకుంటే లక్ష్మీదేవి కనిపించకుండాపోయింది. గొల్లుమన్నారు ఓపికున్నంతవరకూ! కూతుర్ని స్వంతచేతులతో చంపుకుంటున్నాడంటున్నారందరూ అని చలపతికి అనుమానం, అతని దగ్గరకొచ్చి ఎవరూ అనకపోయినా! అనేవారేమోగాని చలపతి వాలకం మరీ మారిపోయిందీ మధ్య. 'పాపం చలపతి!' అన్నట్లు తయారయ్యాడు. ఏదో ఆవేశంలో పిల్లల్ని ఏదో అంటారు కానీ, పిల్లలుపోతే భరించగల్గిన గుండె లెక్కడుంటాయనీ?

సరిగ్గా నెలరోజులక్రితం ఓ వింత జరిగింది. కారు మబ్బుల్లోంచి మెరుపు తళుక్కుమన్నట్లుందని అభివర్ణించారు ఆధునికులయినవారు. గొడ్రాలి కడుపున పిలక మొలిచినట్లుందని అనుకున్నారు పాతకాలపు వాళ్ళు. లేకపోతే చలపతి జన్మలో పెళ్ళిళ్ళు కూడా చేయగలడా అని! చలపతి రెండవ కూతురు లైలా అయింది. అంటే ఆమె ఎవర్నో ప్రేమించి దౌర్భాగ్యురాలయిందని కాదు. లైలా అనడంకన్న ఏ శకుంతలో అనడం బాగుంటుందేమో శకుంతల కథ దుఃఖాంతం కాదుకదా! చిట్టి కథ అంతం ఎలావుంటుందో ప్రపంచంలో గుమాస్తా బ్రతుకులు చూస్తున్న వాళ్ళకి చెప్పడం

కష్టం కాకపోయినా 'అపశకునం మాటలు' అంటారనే జంకుతో ఊరుకోవచ్చు. ప్రేమలో కథానాయకి అవడం సుఖప్రారంభం అనే అనుకోవాలి ఆధునికులూ, ఛాందసులూ కూడా!

వీధి మొగన వెంకట్రాయుడిగారింట్లో చిట్టిని చూసిన ఒక గుమాస్తా బ్రహ్మచారి ఆ అమ్మాయిని పెళ్లి చేసుకోవాలనుండి, కట్నాల కాశపడేందుకు నాకు 'నా' అనే వాళ్లెవ్వరూ లేరు అని అన్నట్లు చలపతి పెళ్లాం రామి చెవిలో పడింది. సైడు కాలవల్లో చేపలు పట్టడంలాంటి జీవితంలో చిట్టి లాంటి కన్నె పిల్లలకు గుమాస్తాలకన్నా పెద్ద చేపలు ఎక్కడ్నించి దొరుకుతాయి కనక! చిట్టికి ఆనందమే అయింది. చలపతిలాంటి నాన్నకి కూతురైందైన దానికి ప్రేమలో పాత్ర దొరకడం ఎంత అదృష్టం, అనిపించింది. ఓ పూట ప్రేమా, మరో పూట అన్నం తిని కాలం గడుపుకురావచ్చుని అనుకుంటా చిన్నది. వయసులో వుంది మరి! చలపతి పెళ్లానికి అంబారీ ఎక్కినట్లయింది. చలపతికి ఆనందమో, దుఃఖమో తెలియలేదు......

వర్షంలో పూర్తిగా తడిసిపోయాడు చలపతి. చలిగా వున్నట్లుంది కూడా! అయినా ఆగదల్చుకోలేదు చలపతి. కసిగా వుంది అతనికి. 'వెధవది! తను పుట్టిం దగ్గర్నుంచి కురుస్తోంది యీ వాన... దీనికా భయపడ్డం!' అనుకుంటున్నట్లున్నాడు.

వర్షం ఆగేటట్లు లేదు. బజార్లో చెలిమయ్యశెట్టి దుకాణం చేరేసరికి పైబట్టలే కాకుండా లోపలి రక్తం గూడా తడిసి నీరు గారిపోతుందేమో! అసలే రక్తం తక్కువ మనుషులకి. ఉన్నది కాస్తా నీళ్లలో పల్చబడిపోతే నెల్లాళ్లా పాపం మంచంలో మనిషి నాశ్రయించుకున్న నల్లుల గతేం కాను? మనిషిని మోసంచేస్తే తిరిగి మోసం చెయ్యగలడు నోరులేని జీవాల్ని మోసం చేస్తే పాపం కదూ...చలపతి విచిత్రంగా నవ్వుకున్నాడు.

మనోరమ టాకీసుదగ్గరకు వచ్చాడు చలపతి. ఏనాటిదో పాత సినిమా—బీదలపాట్లు—ఆడిస్తున్నారు. ఏనాడు చూశాడో సినిమా; చూస్తే బాగానే వుంటుందనిపించింది. కానీ బట్టలన్నీ తడిసిపొయ్యాయే! అదీకాక 'హౌస్‌ఫుల్' బోర్డు పెట్టేశాడు టాకీసువాడు. జనం టాకీసు వదిలివెళ్లిపోతున్నారు కాస్త చినుకు తగ్గడం చూసి. ఎవరో ఆడమనిషి ఆదేపనిగా చూస్తున్నది చలపతికేసి. వర్షంలో తడవలేదుగామోసు, ఆ రేషిన బట్టలావుంది. చవకరకం సెంటువాసన. నల్లగా వున్నా నిగనిగలాడుతున్న శరీరం. కొత్తరకం ముస్తాబు, చూస్తుంటే సరదాగానే అనిపించింది. మరీ అలా చూస్తుంది బజారు సరుకేమో అనుకున్నాడు చలపతి.

ఒక క్షణంపాటు, చలపతిలో యిరవై ఏళ్ళ వెనక్కి...

వయసు—రక్తం—వేడి...ఆడది—ఒడుపైన గుండెలు, కితకితలు పెట్టేగుండెలు,



# వర్షంలో మనిషి

[illegible] జరిగిపోయే విప్లవాల్లాగా జగం.

ఆ నల్లని మనిషి, ఆడమనిషి, మరో పొట్ట లాల్చీ అతను, యిద్దరూ రిక్షాలో వెళ్ళిపోయారు.

'ఛీ! కాలుజారితే భగవంతుడు క్షమిస్తాడా, రాముడు పుట్టిన గడ్డమీద పుట్టడం కూడాను' అనో, ఆ అర్థం వచ్చేట్లుగానో అనుకున్నాడు చలపతి.

టాకీసుదగ్గర ఓ క్షణం ఆగిన చలపతి మళ్ళీ బయలుదేరాడు. చీకటి కూడా అల్లుకుంటోంది. కొంచెం వర్షం తగ్గిందికనక, జనం కాస్త అటూ యిటూ తిరుగుతున్నారు రోడ్డుమీద.

చలమయ్యశెట్టి దుకాణంముందు జనం గలాటాగా కూడారు. ఎవ్వరో యిద్దరు రోడ్డుమీద నిలబడి తిట్టుకుంటున్నారు. ఒకతన్ని చలపతి ఎరుగును. శెట్టి కొట్లో గుమాస్తా వెంగళప్ప. పేరుకు విరుద్ధంగా వాడు శెట్టి జరిపే కొంట్లో సగం దొంగవ్యాపారానికి ఆయువుపట్టు అంటారు. రెండవ అతను ఎవ్వరో, పాపం, గౌరవనీయుడిలాగానే వున్నాడు. బెర్లీను డ్రెస్సులో వున్నాడు. 'సెంటిస్ట్రారం ధర్మమా అంటూ ఈ బెర్లీ నొకటి వచ్చింది. అప్పోసొప్పోచేసి ఓటి కొనుక్కుంటే జీవు బండిని వాడినట్లు తుక్కుగా వాడొచ్చు. డాబుగానూ వుంటుంది......' వెంగళప్పలాగా మొరటు మాటలు వాడడం లేదు......అప్పుడప్పుడు యింగ్లీషు వాడుతున్నాడు.

చలపతికి గొడవేమిటో అర్థమయ్యేసరికి అరగంట పట్టింది. బెర్లీను అతను నిన్న వచ్చి కిలోన్నర పంచదార తీసికెళ్ళాట్ట! ఇచ్చిందానికంటే రెండు కిలోలు ఎక్కువగా కార్డుమీద వ్రాశాట్ట వెంగళప్ప...! 'సత్య హరిశ్చంద్రుడి తాతలాంటి నాకు దొంగతనం అంటగడ్తావా నాయాల, ఎక్కువ తీస్కెళ్ళి ఇయ్యాల తగూ తెస్తావా...' అనే అర్థంలో వెంగళప్ప చెరిగేస్తున్నాడు! 'దొంగ వ్యాపారం చేస్తే భగవంతుడు నీ నోట్లో కర్ర కొట్టకపోడులే' అనికూక లేస్తున్నాడు ఆ పెద్దమనిషి. ఈ ప్రపంచంలో భగవంతుడంతటి బలహీనుడు మరెవ్వడూ ఉండడని ఆ క్షణంలో అతనికి తట్టలేదు. కలక్టరు దగ్గర పెర్సనల్ ప్యూన్‌కున్న పలపతి కూడా లేనివాడు కదా పాపం. అరగంట ఓపిగ్గా గడిచింతర్వాత,

ఆ శెట్టి శతన్ని, అవతే నిముగ్గా వున్న జనం సహాయంతో బెంబేలు చేసి గెంటేసి వంతపని చేశాక నెమ్మదిగా వెంగళప్ప దృష్టి వాకర్షించాక చలపతి తన జాబితా యిచ్చాడు.

'శనగపప్పు'

'లేదండి పోపుల్లోకి కూడా దొరకటం లేదు. ఏంటి గిరాకీ......అమ్మాయిగారికి పెళ్ళని యిన్నాం.. మరీ అంత అవసరమంటే మీ రడుగుతున్నారు కనక...కిలో ఆర్రూపాయలు......'

'కందిపప్పు.'

'కిలో మూడ్రురూపాయలు...వింతా ?'

'చింతపండు.'

'కిలో ఐదురూపాయలు ... మనింట్లో మేలిరకంగాని వాడరంటే కిలో ఆర్రూపాయల డెబ్భైరకం వుంది...'

అలా సాగింది వ్యవహారం. క్షణానికి డెబ్భైరెండుసార్లు కొట్టుకుంటున్న చలపతి గుండె అసలు ఆగిపోయాయి ధరల ధాటికి. ...తనకొచ్చే ముష్టి రెండువందల యాభై రూపాయలకి...ఈ ధరలకీ...ఏంటికొనేది... ఆ బాబ్జిగాడు కూడా ఏదో ఉద్యోగం చూసుకుంటే ... ఉద్యోగం చేసుకుంటే ఊరుకో బుద్ధౌతుందా ... వాడికీ పెళ్లి కావద్దా ... సమస్య బరువుగా తోచింది. ముప్పైఫై రూపాయలిచ్చి కొన్న సరుకుల సంచీ అంతకంటే చాలా తేలిగ్గా వుంది.

'ఖైమయిపోయింది, బియ్యం రేషను యివ్వాళ యియ్యం. యింకా రేపు శలవు. ఎల్లుండి రండి' అంటూ తలుపులువేసే ప్రయత్నంలో పడ్డాడు శెట్టి తన బలగంతో సహా.

'ఇంట్లో ఒక్క గింజ లేదు...'

'ఈ మాటలన్నీ యిని యిని యిసిగేసిపోయిందండి. అయిపోయిందాకా ఎవరు కూర్చుండమన్నారనీ ... మధ్యాహ్నం రాకూడదూ. ఓ పిల్లాణ్నిక్కడే పోస్టు చెయ్యకూడదా!' అంటూ యికిలించాడు శెట్టి. ఆ హాస్యం విని నవ్వే ఓపిక ఎవరికుందని...'

'చదువులూ, ఉద్యోగాలూ మానేసి ఈ షాపులదగ్గర కూర్చుందాం యింక. వెధవ రోజులొచ్చిపడ్డాయి.' అంటూ నీరసంగా యుద్ధంలో ఓడిపోయిన సైనికుల్లా మొఖాలు వేలాడేసుకుని వెళ్లిపోతున్నారు ప్రజలు. ▲

'[illegible] ఉంటార్లేమోకొంది !' అన్నాడు శెట్టి. వెళ్ళిపోతున్న వాళ్ళలో ఎవడికో ఒళ్ళు మండింది.

'చూడండి! మంత్రిగారి బామ్మర్దిలా ఆ పొగరు. కుంపట్లు ఆర్పేసుకోడం కాదురా... నీ కొట్లో కుంపట్లు వెలిగిస్తాం ... రండయ్యా! వీడి పొగరణుద్దాం...'

పదిమంది, పదిహేనుమంది ... పాతిక మందిదాకా శెట్టి కొట్టు మీద పడ్డారు. యిద్దరు శెట్టిని, యిద్దరు వెంగళప్పని గట్టిగా పట్టుకుని నాలుగు మోదారు. కొట్లో కుర్రాళ్లు పరుగెత్తిపోయారు... మిగిలినవాళ్లలో ఒకడు కౌంటరు దగ్గర కూర్చుని బిల్లు రాశాడు. మరొకడు డబ్బు లెక్కపెట్టాడు. ఇద్దరు తూకాలు చూశారు. అరగంటలో అందరూ బియ్యం, పంచదార తీసుకెళ్ళారు ... ఆ టైముకి పోలీసులు వచ్చారు...పోలీసుల్ని చూసి వెంగళప్ప గింజుకోడం మొదలెట్టాడు ... కొట్లాట-పంచాయితీ...అరెస్టు ... ముగ్గుర్ని తీసికెళ్ళారు పోలీసులు. దూరంగా నిలబడి చూస్తున్న చలపతికి బాధగా...నీరసంగా వుంది—యీ వ్యవహారం చూస్తుంటే. బ్రతుకు ... ఆకలి ...దరిద్రం...కొట్లాటలు...కిలో ఆర్రూపాయలు...ఏడ్రూపాయలు... మండిపోతోంది... బ్రతుకా యిది...

చలపతి వంటిమీది బట్టలు ఆరుతున్నాయి నెమ్మదిగా...యింటి మొఖంపట్టాడు బరువైన అడుగేస్తూ...

.....యింట్లో కోలాహలంగా వుంది. ఆడంగులందరూ హడావుడిగా వున్నారు. చలపతి వుంటున్న అద్దె యింట్లో మూడు ముట్లు గదుల్లాంటి వున్నాయి మొత్తం మీద. అరవై రూపాయిలిస్తున్నాడు నెలకో సారి...అదీ తక్కువ అంటున్నాడు ఉదారుడైన యింటి యజమాని. ఒక గది కారోబా ప్రత్యేకమైన శోభ వచ్చింది. అది శోభనం గదైంది.

తాటాకు విసినకర్రతో విసురుకుంటూ ఆశ, విసుగు, ఆవేశం-అన్నీ ఒకటై ఎదురు చూస్తూ కూర్చున్నాడు గుమాస్తా చలపతి గుమాస్తా అల్లుడు. చలపతి యింట్లో ఆ రోజు ప్రొద్దున్న వివాహం జరిగింది.

'పెళ్లికూతురా రావే!' అంటోందో ముత్తయిదువ.

'సిగ్గంత దొంతరైపోయింది కదే మన చిట్టి...' అంటూ ముచ్చటలు పోయింది, బాడంగా ఏదో తలచుకుంటున్న టొకావిడ,

# సైంటిస్టులు

## నొప్పిని అతి శీఘ్రముగా తొలగించునట్టి విధానమును

# కనుగొన్నారు




# మైక్రొఫైన్డ్ 'ఆస్ప్రో'

ఇప్పుడు, మొదటిసారిగా భారతదేశంలో ప్రవేశపెట్టబడినది

**బాధ మీ సమస్య :** "ఆస్ప్రో" యొక్క పరిశోధన సంస్థలో, బాధ యొక్క సమస్య మీద పని చేస్తున్న సైంటిస్టులు ఇప్పుడు, క్రొత్త మైక్రొఫైన్డ్ ఆస్ప్రోను కనుగొన్నారు — ఇది బాధను అతి శీఘ్రంగా పోగొట్టే సాధనము

**మైక్రొఫైన్డ్ అంటే ఏమిటి?** మైక్రొఫైన్డ్ అంటే, ఆస్ప్రోలోని నొప్పిని పోగొట్టే పదార్థము మునుపటి రెట్లు సన్నగా క్రొత్త ప్రత్యేకమైన పద్ధతిలో చెయ్యబడినది. ప్రతి మాత్రలోను ఇప్పుడు ఇంచుమించు 15 కోట్లు అతి సూక్ష్మమైన అణువులు వుంటాయి. అందువలన, రెండింతల కన్నా ఎక్కువగా నొప్పిని పోగొట్టే శక్తి అతి శీఘ్రంగా పని చేసి, మూడు రెట్లు శీఘ్రంగా నొప్పిని తొలగించును.

**అతి శీఘ్రంగా పని చేస్తుంది-చాలా సేపు వుంటుంది :** క్రొత్త మైక్రొఫైన్డ్ ఆస్ప్రోలోని చురుకైన, పదార్థము సునాయాసంగా, అతి త్వరగా ఇమిడి శరీరమందు 6 నుండి 7 గంటల దాకా వుంటుంది. ఇందువల్లనే, మైక్రొఫైన్డ్ ఆస్ప్రో అతి శీఘ్రంగా నొప్పిని తొలగిస్తుంది, మరియు చాలా సేపు వుంటుంది.

**తీసుకోవడం చాలా సులభము :** క్రొత్త మైక్రొఫైన్డ్ ఆస్ప్రోను మీకు ఇష్టమైనట్లు తీసుకోవచ్చును అలాగే కాని, నీళ్లలో కలిపి కాని, ఒక గ్లాసుడు నీళ్లతో కాని, లేక వేడి పానీయముతో కాని తీసుకోవచ్చును

**వీటికోసం క్రొత్త మైక్రొఫైన్డ్ 'ఆస్ప్రో'ను వాడండి :** నొప్పి, తల నొప్పి, ఒళ్లు నొప్పి, పంటి పోటు, కీళ్ల నొప్పి, జ్వరముతో కూడిన జలుబు, ఫ్లూ, కీళ్ల నొప్పులతో కూడిన జ్వరము, గొంతుకనొప్పి

**మోతాదు :** పెద్దవారికి : రెండు బిళ్లలు, అవసరమైతే మళ్లీ వేసుకోండి. పిల్లలకు : ఒక బిళ్ల, లేక డాక్టర్ సలహా ప్రకారము వేసుకోవలెను.

క్రొత్త మైక్రొఫైన్డ్ 'ఆస్ప్రో' ఈ విధంగా పనిచేస్తుంది




బిళ్లలోని అణువు ఎంత పెద్దదిగా వుంటే అంత నెమ్మదిగాను అది ఇముడుతుంది— అందువల్ల మీకు, నొప్పి తగ్గడానికి చాలా సేపు ఆగాలి.




ఇది మైక్రొఫైన్డ్ చెయ్యబడుట వలన, ప్రతి, క్రొత్త మైక్రొఫైన్డ్ ఆస్ప్రో, బిళ్లలోను ఇంచుమించు 15 కోట్లు అతి సూక్ష్మమైన అణువులు వుంటాయి. ఇందువలన, అవి అతి త్వరగా ఇమిడి, అతి శీఘ్రంగా నివారణ నిచ్చును.

క్రొత్త మైక్రొఫైన్డ్ 'ఆస్ప్రో', నొప్పిని, నివారించుటకు, ఇప్పుడు మీకు లభించే వాటిలో అతి అధునిక మైన సాధనము.









మైక్రొఫైన్డ్

**ఆస్ప్రో**

అతి శీఘ్రంగా నొప్పిని తొలగించును

నికోలస్ (N) ఉత్పత్తి

# వర్షంలో మనిషి

ఓణీలు వేసుకుంటున్న అమ్మాయిలు ఆత్రంగా చూస్తున్నారు ... 'మీరు పొందే ఆనందానికి ..' అని కసురుతున్నారు చీరలు కట్టుకున్న పెద్దవాళ్ళు వాళ్లని! నవ్వుతూ దూరంగా వెళ్తున్నారు వాళ్ళు...వాళ్లకేదో తెలిసీ తెలియనట్లుండి సరదాపడుతున్నారు.

భుజాన సంచీ వేసుకుని, తడిసొడ్డి బట్టలతో వీధిగుమ్మం ఎక్కుతున్న చలపతి భార్యవెంట పడ్డాడు.

'ఇదేం సౌద్యముండీ ... రేపో ఎల్లుండో తెమ్మన్న సరుకులు ఈరోజే తెచ్చారా కొంప మునిగిందనుకుని. ఇంట్లో వుండమంటే వూరేగ వెళ్లారా...ఛఛ ... నా కర్మకొద్దీ దొరికారు కదండీ...'

'కర్మకొద్దీనే దొరికామే ఒకరికొకరం. మూరుకు పెట్టుకున్న పొగలా ఈ దరిద్రపు బ్రతుకు బ్రతుకుతున్నాం.' అన్నాడు చలపతి విసుగ్గా !

'చాల్లే ఊరుకోండి ... ఇంట్లో శుభకార్యం జరుగుతుంటే దరిద్రం ఓదుతూ ఏవిటా మాటలు ?'

'నోర్ముయ్...'నీరసంగా అన్నాడు చలపతి.

భార్య తలలో పూలచెండు చూస్తుంటే చలపతికి ఎవరో కడుపులో కెలుకుతున్నట్లయింది. ఒకసారి అతనూ, భార్యా ముసలివాళ్లయిపోయినట్లు అనిపించింది.

'ఆ పూలుకూడా ఎందుకే ముడిచావ్ ? ముసిలిపీనుగులం ... మనకి సింగారాలు కూడానా...నా...'

'తమరు లోపలికి దయచేయండి......' అంటూ విసురుగా కూతురు ముచ్చట్లు చూసేందుకు వెళ్లిపోయింది చలపతి పెళ్లాం.

'ఇంక దాన్నొదిలెయ్యండా!' అని ఎవరో వచ్చనీరం చూపించారు......చిట్టి లోపలికెళ్లిపోయింది......శోభనం గదిలోకి వెళ్లిపోయింది. ఈ భూమిమ్మీద పుట్టినందుకు తన కడుపున నల్గురు పుడితే జన్మిచ్చిన దేవుడి రుణం దీర్చుకోవచ్చునని వెళ్లింది.

చలపతి కదంతా కడుపులో తిప్పుతున్నట్లున్నది

శోభనం గదిలో తన కూతురూ, అల్లుడూ...

'ఏ ఆనందతీరాలకో వెళ్లిపోతాం, అందాల మేడల్లో పాడుకుంటూ...బంగారు బ్రతుకులో ఆడుకుంటాం' అనుకుంటూ ఒకళ్ల నొకళ్ళు మోసం చేసుకుంటారు' అని ఊహించుకుంటున్నాడు చలపతి.

'ఏవరు ఏం చెప్పగలరమ్మా... అమ్మాయి వచ్చిన వేళావిశేషంవల్ల అల్లుడు పెద్ద గుమాస్తా అయి... ఆఫీసరైనా అవచ్చు...' అంటున్నారొకరు.

'ఆఫీసరు ప్యూన్ కాకుండా వుంటే చాలు' చలపతి ఊహ!

'మా చిట్టి కడుపున రత్నాలే పుట్టొచ్చు. మా మనవడు కలక్టరైనా కావచ్చు, కాదుటే తల్లీ...ఇప్పుడు కలక్టరు అయినవాడు ఒకప్పుడు అమ్మదగ్గర 'అ ఆ'లు నేర్చుకున్నవాడే కాదుటే తల్లీ....భగవంతుడు మంచివాళ్లని అన్యాయం చెయ్యడు సుమా...' ప్రపంచంలో ఎంత దాతృత్వం. కరుణ ఉన్నాయి!

'నా బొంద! మా వంశాలు ఏడుమడతలు వేసి విప్పినా కలక్టరు లేడు. వాడి ప్యూన్ కూడా పుట్టలేదు యింతవరకూ!'

'ప్రపంచమంతా చెడ్డవాళ్లే నన్నమాట ...అందుకే కలక్టర్లు, మంత్రులు కొంచెం మందిమాత్రమే వున్నారు...' జ్వరం తగ్గినట్లనిపించింది చలపతికి.

వచ్చిన వాళ్లందరూ వెళ్లిపోయాక, 'బొమ్మలపెళ్లిలా అయింది నా తల్లికి!' అనుకుంటూవచ్చిన చలపతిభార్య మంచం మీద కప్పేలా పడున్న చలపతిని ఓ క్షణం చూసి, 'వెర్రిబాగుల మనిషి' అనుకుంటూ, చాపమట్టలా వాలిపోయిన పిల్లల్ని...మురళి సీత, రాముడు, వెంకుగాడు, బుల్లిది అని పేరు పేరునా ఐదుగుర్ని లెక్కపెట్టుకుని, అప్పుడే సినిమానుండి వచ్చిన బాబ్జీని చూసి అన్నం పెట్టడానికని వంటింట్లోకి వెళ్లింది. చలపతి మరి అన్నానికి లేవలేదు ఆ రాత్రి.

కలతగా నిద్రపోయాడు చలపతి ఆర్రాత్రి.

నిద్రనిండా కలలు...కలలనిండా...మనుషులు ...వర్షంలో తడుస్తూ ... ఎండలో ఎండుతూ ... ఫైళ్లమీద వాలిపోతూ... మనుషులు...పిచ్చిమనుషులు... రేషన్ షాపు... పాలబూతు.......బీదలపాట్లు సినిమా... సినిమా దగ్గరి పడుచుది......బెజవాడ స్టేషన్ దగ్గరొచ్చేటప్పు డెదురయ్యే కొండల్లా దాని గుండెలు...కలెక్టర్లు... పోలీసులు... మంత్రులు ... మంత్రసాన్లు... పోయిన లక్ష్మీదేవి ... ఒకరేమిటి, అందరూ కనబడ్డారు. చివరికలలో కలక్టరు మనవడు...

తెల్లవారకట్ట ఐదుగంటలప్పుడు మెలకువ వచ్చింది. శోభనం గది తలుపు తెరుచుకుని, దేశానికి పండంటి బిడ్డనిచ్చేందుకు తన ప్రయత్నం తను చేశానవే తృప్తితో బయటపడింది చిట్టి తల్లి... తెరచివున్న తండ్రి కళ్లవంక పిచ్చిగా చూసి తల దించుకువెళ్లింది.

'మొహం కడుక్కోండి...నీళ్లు పెట్టాను' చలపతి మొహం కడుక్కున్నాడు.

'వేన్నీళ్లున్నాయి. నీళ్ళు పోసుకోవడం కానీండి నాన్నా!'

చలపతి స్నానం అయింది.

'నిన్న సినిమా హాల్లో బాంకు మేనేజరు కొడుకు స్నేహితుడయ్యాడు నాన్నా... బాంకులో ఖాళీలున్నాయట'

'ఉద్యోగం దొరకొచ్చొన్నమాట'—చలపతి ఆలోచన.

'అల్లుడు కూడా తయారుగా వున్నాడు. భోజనానికి లేవండి.'

చలపతి భోజనం కానిచ్చాడు.

వంకాయ పెరుగుపచ్చడి......చలపతి యిష్టం...ఉల్లిపాయ పులుసు ... చలపతి ప్రాణం...పెరుగు.. చలపతికి వరం..

'ఇదుగో తమలపాకు వేసుకోండి'

తాంబూలం వేసుకున్నాడు చలపతి.

పంచ మరోసారి ఊడదీసి చక్కగా కుచ్చెళ్లుపోసి కట్టుకున్నాడు చలపతి. తల దువ్వుకుని, చెప్పుల్లో కాళ్లుదూర్చి తీరిగ్గా, బయలుదేరాడు.

'చిట్టి తల్లి కడుపున కలక్టరే పుడ్తాడేమో!' అనిపించిందెందుకో చలపతికి.

'నేనూ వస్తున్నానండీ!' అంటూ అల్లుడూ కూడా చెప్పులేసుకున్నాడు.

'ఈ రోజు సెలవు పెట్టక పోయావు టోయ్?'

'లేవండీ! యివ్వరు. ఆడిట్ టైమ్ కూడానూ!'

'వర్షం పడేట్టుందే!' అన్నాడు ఆకాశం కేసి చూసి అల్లుడు.

ఓసారి వెనక్కి తిరిగిచూశాడు. చిట్టి తల్లి కళ్ళు, అల్లుడి కళ్ళు, కలెక్టరుగారి క్యాబోయే కళ్ల నకళ్లు.

'పెద్దగా పడేదికాదులే!' అంటూ అడుగేశాడు చలపతి.

సన్నటి తుప్పర పడుతోంది.

వర్షంలో తోడుగా వెళ్తున్నారు గుమాస్తా, చలపతి, గుమాస్తా అల్లుడు. ●




■ చక్రవర్తి కుమారుని జన్మదినోత్సవానికి రాజు చక్రవర్తి రాజధానికి వెళ్లవలసివచ్చింది. చక్రవర్తి కుమారుని జన్మదినానికి కానుకగా యివ్వడానికి రాజు ఒక బంగారపు పళ్లెన్ని తయారు చేయించాడు. సరిగ్గా బయల్దేరే సమయానికి రాజుకు అనారోగ్యం చేసింది. అందుచేత రాజు, తన తరఫున చక్రవర్తి వద్దకు వెళ్లవలసినదిగా మల్లన్నమంత్రిని కోరేడు. ఆ పళ్లెన్ని తీసికొని మల్లన్నమంత్రి బయల్దేరాడు.

మల్లన్నమంత్రి తమ రాజధానికి వస్తున్నాడన్న విషయం చక్రవర్తికి తెలిసింది. మల్లన్నమంత్రి తెలివి తేటలను గురించి చక్రవర్తికి బాగా తెలుసును కాబట్టి యెలాగైనా ఒక సారి మల్లన్నమంత్రిని మోసం చేయాలని చక్రవర్తికి సరదా కలిగింది. వెంటనే చక్రవర్తి కొంతమంది దొంగలను రాజభటుల వేషంతో మల్లన్న మంత్రికి చాలా దూరంలోనే స్వాగతం చెప్పడానికి పంపించాడు.

మల్లన్నమంత్రి చక్రవర్తి నగరానికి యింకా మూడురోజుల ప్రయాణపు దూరంలో ఉండగానే చక్రవర్తి భటులు మల్లన్నమంత్రిని కల్సుకొని అతనితోపాటుగా తిరిగి చక్రవర్తి నగరానికి బయల్దేరారు. ఆ రాత్రి మల్లన్నమంత్రి మామూలుగానే తన గుడారంలో పడుకొన్నాడు. పడుకొనేముందు బంగారపు పళ్లెంలో నిండుగా నీళ్లుపోసి తన గుండెల మీద ఉంచుకొన్నాడు. ఎవరు ఆ పళ్లెన్ని కదిలించినా, నీళ్లు తొణికి మల్లన్నమంత్రి మీద పడతాయి. వెంటనే అతనికి మెలకువ వస్తుంది. పళ్లెన్ని యెవరూ దొంగిలించకుండా మల్లన్న మంత్రి యీ ఉపాయాన్ని పన్నేడు.

చక్రవర్తి భటుల వేషంలో ఉన్న దొంగలు మల్లన్నమంత్రి గుడారం మీదకు యెక్కేరు. అక్కడ నుంచి ఒకదొంగ సన్నపాటి గొట్టాన్ని ఆ పళ్లెంలో ఉంచి నోటితో ఆ నీటిని పీల్చివేశాడు. తరువాత మరొక దొంగ గుడారంలో రహస్యంగా ప్రవేశించి ఆ పళ్లెన్ని తీసికొని పారిపోయాడు.

మల్లన్నమంత్రి మామూలుగా చక్రవర్తి నగరానికి చేరుకొన్నాడు. తన కుమారుని జన్మదినం నాడు చక్రవర్తి అతిథులందరికి విందు యేర్పాటు చేశాడు. దొంగలు తీసికొని వచ్చిన పళ్లెన్ని ఆ విందులో చూపిస్తూ చక్రవర్తి యిలాగ అన్నాడు. 'ఈ పళ్లెన్ని మల్లన్నమంత్రిగారు మాకు కానుకగా పంపించారు.'

వెంటనే మల్లన్న మంత్రి యిలాగ సమాధానం యిచ్చాడు. 'ప్రభూ! తమ భటులు పొరబాటుగా, నేను భోజనం చేసే పళ్లెన్నే తీసికొని వచ్చేరు. తమకు కానుకగా యివ్వడానికి తీసికొని వచ్చిన పళ్లెం యిదిగో' అని చెబుతూ చక్రవర్తి కుమారుని పేరు చెక్కి ఉన్న పళ్లెన్ని చక్రవర్తి చేతికి అందించాడు.

ఆ పళ్లెన్ని చూసి నిర్ఘాంతపోయిన చక్రవర్తి యీ తారుమారుకు కారణం చెప్పవలసినదిగా మల్లన్న మంత్రిని కోరాడు.

'ప్రభూ! నేను చాలా దూరంలో ఉండగానే తమ భటులను యెదురుగా పంపించారనగానే నాకు అనుమానం కలిగింది. అందుచేత నేను భోజనం చేసేపళ్లెన్నే నేను గుండెలమీద ఉంచుకొని పడుకొన్నాను. అదే కానుక నిమిత్తం తీసికొని వస్తున్న పళ్లెం అనుకొని తమ భటులు దాన్ని దొంగిలించారు.' ఈ సమాధానం విని చక్రవర్తి మల్లన్నమంత్రి తెలివి తేటలను యెంతగానో కొనియాడేడు. ●



# అతని చిల్లర ఖర్చులకు డబ్బు కొంత పొదుపు అవుతుంది!



ప్రతినెల చిల్లరఖర్చులకు అతనికి డబ్బు ఇస్తారు. ఆ డబ్బు కేవలం ఖర్చుకే కాదు, పొదుపుకు కూడా అని అతనికి తెలుసు. అందుచేత, ప్రతినెల ప్రప్రథమంగా అతడు స్టేట్ బ్యాంకుకు వెళ్లతాడు. అలాగే అతని పొదుపుకూడా క్రమంగా పెరుగుతూ ఉంటుంది.

## స్టేట్ బ్యాంక్ సేవ నిమిత్తం

S. 230 Tly

# వారఫలం

## 29-12-67 శుక్రవారం మొదలు 4-1-68 గురువారం వరకు

**మేషం :** ఇదివరకు మీకు ఆందోళన కలిగించిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. వ్యాపారంలో ప్రయోజనం గల వ్యక్తులను కలుసుకొంటారు. ఉద్యోగంలో గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

**వృషభం :** వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. బంధుమిత్రులను కలుసుకొంటారు.

**మిథునం :** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరతాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి. ప్రయాణాల్లో శ్రమకలుగుతుంది. ఆందోళన కలుగుతుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. అధిక వ్యయం జరుగుతుంది.

**కర్కాటకం :** వ్యాపారంలో పోటీవారితో పోటీ పెరుగుతుంది. రావలసిన డబ్బుమీద ఆధారపడి ఇతరులకు వాగ్దానాలు చేయడం తగదు. సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. నూతన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**సింహం :** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహసముతోకూడిన వ్యవహారాలు లాభించగలవు. పోటీవారితో మాట పట్టింపులు తగవు. ప్రయాణాలు కొంచెం శ్రమమీద ఫలిస్తాయి. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**కన్య :** ఇతరులనిమిత్తం చేసే ప్రయత్నాలు సులువుగా నెరవేరతాయిగాని మీ స్వంత పనుల్లో శ్రమ కలుగుతుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొహమాటాలు తగవు. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది దైవ కార్యాలు నెరవేరతాయి.

**తుల :** వ్యాపారంలో పోటీవారి పోటీని యెదుర్కొని అనుకూలతను సాధించగలరు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి. రాజకీయ వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొహమాటాలు తగవు. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు:— విలాస వస్తువులు కొంటారు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృశ్చికం :** భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ఉద్యోగంలో అనుకూల వార్తలను వింటారు. ప్రయాణాలు లాభదాయకంగ ఉంటాయి. కోర్టు వ్యవహారాలు ప్రోత్సాహకరంగ ఉంటాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది శుభకార్యాల విషయంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి.

**ధనుస్సు :** వృత్తి వ్యాపారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి ఆర్థిక వ్యవహారాలు వారం మధ్యలో బాగా ఉంటాయి. ఉద్యోగంలో మీ పరిస్థితి సంతృప్తి కరంగా ఉంటుంది. నూతనవ్యవహారాలు లాభించ గలవు. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీకృషి రాణిస్తుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. బంధుమిత్రులను కలుసుకొంటారు.

**మకరం :** ఇంతవరకు అనుకూలంగా ఉన్న వ్యవహారాల్లోనే చికాకులు యేర్పడతాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం మధ్యలో అనుకూల పరిస్థితులు యేర్పడుతుంది. వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. అధిక వ్యయం జరుగుతుంది.

**కుంభం :** భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలకంటే మీరు స్వంతంగా చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. రావలసినడబ్బు సమయానికి అందుతుంది. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోనూ చికాకులు యేర్పడతాయి. మీతాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

**మీనం :** ఆదాయం మాట యెలాగ ఉన్నా, అన్ని వ్యవహారాలు అనుకొన్నట్లుగా నెరవేరతాయి. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. వృత్తిలో నూతన అవకాశాలు లభిస్తాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. అనుకూల వార్తలను వింటారు.

— మహేష్



# రాళ్ళు

బి.పి. కరుణాకర్

దానయ్య రిక్షాను శ్మశానం గోడ ప్రక్కగా ఆపి దిగాడు. తలకు చుట్టుకున్న ఎర్రగళ్ల టవల్ తీసి ముఖం తుడుచుకున్నాడు. ఆయాసం తగ్గలేదు. వొళ్లంతా చిరచిరంగా ఉంది.

'మేస్త్రీ! దిగు. ఇదే' అన్నాడు దానయ్య.

మేస్త్రి రిక్షా దిగి ఒకసారి వొళ్లు విరుచుకున్నాడు.

'ఓర్నీ. శానాదూరం తెచ్చేవుగదరా — రోడ్డు కూడ సరింగలేదు. వొళ్లు హూనమైపాదిరా' అన్నాడు మేస్త్రి.

'ఎదవ రోడ్లు'

'ఊ' అని ప్రక్క జేబులోంచి చుట్టతీసి వెలిగించాడు మేస్త్రి. 'ఈడ్నుండి సిటీలోకి రెండుమైళ్లుంటాయా' అడిగాడు.

'ఉండొచ్చు' అని బనియన్ జేబులోంచి సగం కాల్చి బీడీతీసి వెలిగించాడు దానయ్య. దమ్ము లాగాడు. దగ్గు వచ్చింది.

'దిజామా?'

దానయ్య దగ్గుతూనే తలూపి ముందుకు నడిచాడు.

'నీ యమ్మ సచ్చిపోయి సంవత్సరం దాటిందా?' ప్రక్కనే నడుస్తూ అడిగాడు మేస్త్రి.

'సంవత్సరం ఏంటి మేస్త్రీ, రెండు సంవత్సరాలైనాది'

'అబ్బో. సరేగాని, నీ అయ్య మీ యమ్మను ఎందుకు సంపేడ్రా?'

'మా అయ్య అంత పొగరుమోతు నాయాలు ఈ పెపంచకంలో మరోడుండడు. అడికి ఇనాళ కాలం ఒచ్చి మా యమ్మను సంపేండు. సేసినపాపం అనుబవిత్తుండుగా.'

'నీ అయ్యను రాజమండ్రి జైల్లోనేగా పెట్టింది?'

'మరే' అని నడుస్తున్న వాడల్లా ఆగి, 'మేస్త్రీ! ఒక మాట' అన్నాడు దానయ్య.

మేస్త్రి ఆగాడు. 'ఏంట్రా?' అన్నాడు.

'సమాది కట్టడానికి డబ్బుయి సాలదా?'

మేస్త్రి పకపక నవ్వి పొగ పీల్చి వదిలాడు. 'అరే దానయ్యా! ఈ పెళ్ళి ఎన్ని తడవలేశావురా? సెప్పు.' అన్నాడు.

దానయ్య పేలవంగా నవ్వాడు. తల వంచుకుని వెంటనే తలెత్తాడు.

'శాన కష్టం రా. ఎందుకంటావా, ఈ సిమెంటు దర, రాయి దర మండి పోతుండాయిరా. సత్తెం సెబితే నువ్వు ఇసుకోవడం లేదుగాని, ఈ కంట్రేక్ట్ నీవాన వొకో పైసకూడ లాబం ఉండదురా. ఇదో ఇటు సూడు ఈ సుట్ట తాగుతూ అగ్ని పెమాణకంగా సెబుతుండా నీ మీవాన జాలేసి ఈ పనికి ఒప్పుకున్నా' అన్నాడు మేస్త్రి.

దానయ్య రెండు చేతులు జోడించాడు. కళ్లల్లో నీళ్లు తిరుగుతున్నాయి. 'నా కాడ డెబ్బయి రూపాయి ఉండాయి మేస్త్రీ' అన్నాడు.

మేస్త్రి ఆ మాట నమ్మలేనట్లు తల అడ్డంగా ఆడించాడు ఆరిపోయిన చుట్టను క్రిందపడేసి దానయ్య కళ్లల్లోకి పరిశోధిగా చూశాడు.

'సత్తెం మేస్త్రీ!'

'నీ కొచ్చె డబ్బంతా ఏం సేత్తు చావురా?'

'నా ఆరోగ్గెం శానా సెడిపోయింది మేస్త్రీ. ఓ దినం రిచ్చా లాగితే మరు దినం రిచ్చా లాగ లేక పోతుండా'

మేస్త్రి చిన్నగ నిట్టూర్చాడు. ముందుకు అడుగులు వేసి 'పద. పద. ఎండ అదిరి పోతుండాది. ముందు నీ యమ్మను ఏడ పాతేసినారో సూపియ్యి. సూ! ఎంత అవుద్దో కరెక్ట్‌గా సెబుతా. నీ వొంటో బాగోకపోతే ధర్మాసుపత్రికి పోకపోయినావా?' అడిగాడు.

దానయ్య మేస్త్రి ప్రక్కనే నడుస్తూ 'ఎళ్లాను మేస్త్రీ. ఆళ్లు నూసి పుటోలు తీసేరు. ఎర్రమందు సీసాలో ఇచ్చి, సనువు పచ్చ మాత్తర్లు దజనిచ్చి పంపేసినారు. ఆ డాట్టరుబాబుకు పందిస్తే మంగళగిరి డాట్టరుబాబుకు — సేర్చుకోమ్మని సీటీ రాసిస్తాడని జవాను సెప్పిండు. పంద ఏడ్నుండి తెచ్చేది మేస్త్రీ. నువ్వు చెప్పు' అన్నాడు.

'కట్టమే'

బీడి క్రింద పడేసి కుడి ప్రక్కకు తిరిగి కంచె ప్రక్కగా ఉన్న పాలరాతి సమాధి వైపు నడవసాగాడు దానయ్య. మేస్త్రీ

మౌనంగా దానయ్యను అనుసరించసాగాడు. వేడిగాలి వినురుగా వీస్తోంది. సమాధుల మధ్య గడ్డి ఎండిపోయి ఉంది. అక్కడక్కడా పక్కాలు పెట్టిన బోరియాలున్నాయి.

దానయ్య చకచక నడిచి ఎత్తుగా కట్టి ఉన్న పాలరాతి సమాధి దగ్గరకు వచ్చాడు. ఎడమ ప్రక్కకు చూశాడు. అక్కడ ఉండ వలసిన మట్టితో ఎత్తుగా కట్టిన సమాధి లేదు. ఎర్రటి మట్టి మిగతా నేలతో సరి సమానంగా ఉంది. దానయ్య నిరుత్తరు డౌతూ మేస్త్రి ముఖంలోకి ఓసారి చూసి తిరిగి మట్టి వంక చూశాడు.

'శానా దూరం తెచ్చావురా దానయ్యా' విశాయమ్మను పాతేసింది ఈడ నేనా?

దానయ్య జవాబు చెప్పలేదు. ముందుకు వంగి మోకాళ్లమీద కూర్చున్నారు. నెల క్రిందట తను ఇక్కడకు వచ్చినప్పుడు ఈ పాలరాతి సమాధి ప్రక్కన అమ్మ మట్టి సమాధి ఉంది. తనకు బాగా గుర్తు. పూలు కుంకుమ తలవేపున పెట్టి డజను అగ రొత్తులు వెలిగించి వెళ్లిపోయాడు. ఇప్పుడా మట్టిసమాధి లేదు. నక్కలు తవ్వితే గుంటలు పడతాయిగాని ఇట్లా వుండదు. హృదయం ఎవరో పిండినట్టనిపిస్తోంది. చేతులు ముందుకు చాచి మట్టి అందుకుని కళ్లకద్దుకున్నాడు. చేతులు వణుకు తున్నాయి. కళ్లల్లో నీళ్లు నిలవడంలేదు.

మేస్త్రి దానయ్య వీపుమీద చేయివేసి నిమిరాడు. 'ఈడనేనా?' అడిగాడు.

దానయ్య తలెత్తి మేస్త్రీ ముఖంలోకి చూశాడు. ఎండిపోయిన పెదాలు చిన్నగా విప్పాడు. మాటలు దుఃఖంతో గొంతులో పూడుకుపోయి బైటకు రాలేదు. తలూపాడు.

మేస్త్రీ జేబులోంచి టేపుతీసి పొడుగూ, వెడల్పు కొలతలు చూసి కాయితంమీద లెక్కలు వేశాడు. 'దానయ్యా! డెబ్బయి ఔలవురా. మరో పదిరూపాయలు ఏడనన్నా సంపాయించావంటే. ఎనబయ్యితో సిన్నసమాధి తయారవుద్ది' అన్నాడు.

దానయ్య మట్టి క్రిందపడేసి లేచి నుంచు న్నాడు. టవల్‌తో ముఖం తుడుచుకున్నాడు. 'వద్దు మేస్త్రీ. సమాధి కట్టనవసరంలేదు' అన్నాడు.

మేస్త్రి ఆశ్చర్యపోయాడు. 'ఏంట్రా అట్లా అంటావు?' అడిగాడు.

'ఈ పాలరాతి సమాధి పక్కనే ఈడనే ఎత్తుగా మట్టితో సిన్న సమాధి కట్టినా మేస్త్రీ! అది లేదు.'

మేస్త్రి పకపక నవ్వాడు. 'భలేవాడివిరా ఈడ ఉండే సమాధి ఎవడు మూకుతాడు.? ఏడకిపోద్ది? సెప్పు. అసలు...విశాయమ్మను పాతేసింది ఈడనేనా?' అడిగాడు.

'ఈడనే. నాకు బాగా గ్యావకం.'

'ఏం గ్యావకమో—ఇప్పుడేం పెద్దా మంటావు?'

'ఏం సెయ్యాలో తెలవడంలేదు.'

మేస్త్రి భుజాలు ఎగరవేశాడు. 'నాకంతా అయోమయంగా ఉండాదిరా దానయ్యా. పద, పద. పోదాం. మళ్లీ నేను బ్రాడీపేట వెళ్ళాలి' వినుగు ధ్వనించే స్వరంతో అని వెనక్కి తిరిగి వచ్చినదారి వెంట అడుగులు వేయసాగాడు.

దానయ్య మెదడు మొద్దుబారిపోతోంది. కొద్దిసేపు పాలరాతి సమాధివంకా, కింద మట్టివంక మార్చి మార్చి చూశాడు. తల్లికి మంచి సమాధి కట్టిద్దామని తను ఎప్పటి నుండో అనుకుంటున్నాడు. తొమ్మిదినెలల నుండి ఓపూట తిని ఓపూట తినక కూడ బెడితే డెబ్బై రూపాయలయ్యాయి. ఎంతో ఆశతో మేస్త్రిని తీసుకువస్తే...జరిగిందిది. తను అనుకున్నవి అనుకున్నట్లుగా ఎప్పుడూ జరగడంలేదు. ఈ సంగతి ఎవరికి చెప్పుకోవాలో అర్థం కావడం లేదు. బాధతో హృదయం మెలికలు తిరిగిపోతోంది. కళ్లుమూసు కున్నాడు. ఎండవేడికి కాళ్లు కాలుతున్నాయి. కళ్లు తెరిచి టవల్ తలకు చుట్టుకున్నాడు. వెనక్కి తిరిగి మేస్త్రి వెనక నడవసాగాడు.

మేస్త్రి రిక్షాలో కూర్చున్నాడు. ఎండ వేడికి అతని నల్లటిముఖం మరింత నల్ల బడింది. 'రా. బేగి. నన్ను బ్రాడీపేట మూడో లైనులో వదిలిపెట్టు!' అన్నాడు.

దానయ్య రిక్షాను రోడ్డుమీదకు తెచ్చాడు. పెడల్‌మీద కాలువేసి ఎక్కబోతూ ఆగి స్మశానంవంక చూశాడు. కంచెప్రక్కగా ఉన్న పాలరాతి సమాధిమీద తల్లి కూర్చుని చేతులు ముందుకు చాచి ఏడుస్తున్నట్లు అనిపించేసరికి అతనిబాధ ఎక్కువైంది. తల తిప్పి మెయిన్‌గేట్‌వంక చూశాడు. ఇనుప తలుపు తుప్పుపట్టి ఒక ప్రక్కగా ఒరిగి ఉంది. గోడప్రక్కగా అరఫర్లాంగు దూరంలో ఓ చిన్న తాటాకుటిల్లు ఎండమావు లతోపాటు కదులుతూ కనిపించింది. పెడల్ మీద వేసినకాలు తీసి హేండిల్ ప్రక్కకు తిప్పి రిక్షా కదలకుండా రోడ్డుమధ్యన పెట్టాడు.

చేరగిలబడి కూర్చున్న వాడల్లా సరిగా కూర్చుని దానయ్యవంక చూశాడు మేస్త్రి. 'ఆలీసెం.ఏంట్రా? నాకు జరూరు పనుండ దంటే ఇనిపించుకోవేం?' కోపంగా అన్నాడు.

'మేస్త్రిబాబూ! నీకు దండంపెడతా. ఓ పదినిమిసాలాగు ఇప్పుడేఒత్తా.' అని మేస్త్రి జవాబుకోసం ఎదురు చూడకుండా చకచక తాటాకుల ఇంటివైపు నడవసాగాడు.

దానయ్య తాటాకుల ఇంటిముందు ఆగి తలుపుతట్టాడు. మట్టిగోడలు ఒకప్రక్కగా ఒరిగి ఉన్నాయి. గాలికి ఎండిపోయిన తాటా కులు గలగలమని చప్పుడు చేస్తున్నాయి. ఇంట్లోంచి నవ్వులు, గాజుల చప్పుడు చిన్నగా వినిపిస్తున్నాయి. తలకు చుట్టు కున్న టవలుతీసి భుజాలు కప్పుకుని అర నిమిషం ఆగాడు, తలుపు తెరుచుకోలేదు.

తిరిగి తలుపు తట్టాడు.

నవ్వులు ఆగిపోయాయి.

'ఓరో ఒచ్చేరు'—తడబడుతూన్న స్త్రీ బొంగురుగొంతు.

'నీ మొగుడా ఏమిటి?'—భయపడు తూన్న మొగగొంతు.

'ఏమో.'

రెండు క్షణాల తర్వాత 'ఓరూ?' బొంగురు గొంతు లోపల్నుండి ప్రశ్నించింది.

'నేను. నా పేరు దానయ్య'

'భయపడ మాక. మువ్వత్త పిరికిమనిసివి. ఆయన కాదులే'—మాటలు చిన్నగా విని పించాయి.

కొద్దిసేపటికి చెక్కతలుపు కొద్దిగా తెరుచుని ముప్పైసంవత్సరాల స్త్రీ ముఖం కనిపించింది. చిన్న ముక్కుకు పెద్ద ముక్కు పుడక ఉంది. పళ్లు కొద్దిగా ఎత్తుగా ఉన్నాయి. పెద్ద నుదుటిమీద ముంగురులు చెదిరిపోయిఉన్నాయి. కోలముఖం. స్ఫోటకం మచ్చలు.

ఆమె నుదుటిమీద పడిన ముంగురులు పైకిబెట్టుకుంటూ 'ఓరు కావాలెటి?' అడి గింది.

'దీనికి కావాలా ఓరు?'

'మా ఆయున.'

'ఇంటో ఉండాడా?'

'లేదు బజారుకు ఎళ్లిండు.'

'ఎప్పుడొత్తాడు?'

'సీకటి పడేఏళకుగాని రాడు' అని ముఖం చిట్లించి పెద్ద శబ్దమయ్యేలా తలుపు వేసుకుంది.

దానయ్య వెనక్కి తిరిగాడు. లోపల్నుండి తిరిగి నవ్వులు మొదలయ్యాయి. తలి గుర్తువస్తోంది. ఆనాడు...రెండు సంవత్సరాల క్రిందట...ఆలోచించలేక తల అడ్డంగా ఆడించి ముందుకు నడిచాడు.

*   *   *

## రాళ్లు

రాత్రి ఏనిమిది దాటింది.

పండువెన్నెల స్మశానంమీద పరుచుకుని పడుకుని సమాధులను జోకొడుతోంది.

దానయ్య రిక్షా గోడపక్కగా ఆపాడు. రిక్షాదిగి దీపం ఆర్పివేశాడు బీడీతీసి వెలిగించి దమ్ములాగాడు. ఊపిరితిత్తులు పొగభరించలేకపోయాయి. దగ్గు వచ్చింది. కడుపు ఖాళీగా ఉంది ఆకలివేస్తోంది. గుండెనొప్పిగా ఉంది. రేపటికి గుండెనొప్పి తగ్గితే రిక్షా వేయవచ్చు అనుకుంటూ వెన్నెల్లో నీడ కుప్పలా కనిపిస్తున్న తాటాకుల ఇంటివైపు నడవసాగాడు. దానయ్య అడుగులు ఎండు పుల్లలమీదపడి నిశ్శబ్దాన్ని చెదరగొడుతున్నాయి. చల్లటిగాలి విసురుగా వీస్తోంది. దూరంగా నక్కలు ఉండి ఉండి అరుస్తున్నాయి. కాళ్లు నొప్పిగా ఉన్నాయి. బీడీతాగ బుద్ధికావడంలేదు. క్రిందపడేయడానికి మనసు ఒప్పడంలేదు.

ఇంటి దగ్గరకువచ్చి ఆగాడు. తలుపు తెరిచే ఉంది. తొంగి చూచాడు. కోడిగుడ్డు లాంతరు నీరసంగా వెలుగుతోంది. ఓ మూలగాఉన్న నులకమంచంమీద మధ్యాహ్నం కనిపించిన ఆమె తలకు పట్టువేసుకుని మూలుగుతోంది. బీడీ క్రిందపడేసి కాలితో నొక్కాడు. ఆమెను పిలుద్దామనుకునేంతలో వెనక అడుగులు చప్పుడు వినిపించింది. వెనక్కి తిరిగాడు.

దానయ్య నీడ అతనిమీద పడి ముఖం సరిగ్గా కనిపించడంలేదు.

'ఓరో?' అడిగాడతను.

'దీనికి కావలా ఉండేది నువ్వేనా?' అడిగాడు దానయ్య.

'అవును.'

'నా పేరు దానయ్య. నీతో ఒక సిన్న ఇసయం మాటాడదామని ఒచ్చా. నీ పేరు?'

'ఎంకటసామి. నీ కాడ బీడీ ఉందా?'

దానయ్య తలూపాడు. జేబులోంచి బీడీ తీసి వెంకటస్వామి కిచ్చి అగ్గిపెట్టె ఇవ్వబోయాడు.

'అగ్గిపెట్టె నా కాడుండాదిలే' అని అతను బీడీ వెలిగించి కూర్చున్నాడు.

'కూకో.'

దానయ్య అతని ఎదురుగా కూర్చున్నాడు.

'ఏటా ఇసయం?' అడిగాడు వెంకటస్వామి.

'ముద్దేనం నీకోసం ఒత్తె నువ్వు లేవు' ఆగాడు. నొప్పితో గుండె బిగబట్టుకుపోతోంది. సమాధి విషయం ఏవిధంగా ప్రస్తావించాలో అర్థం కావడంలేదు.

'ఓరో ఒచ్చేరని మా ఆడమనిసి సెప్పింది. ఆ మనిసి నువ్వన్నమాట సెప్పు.'

'అదో ఆ దక్షిణం దిక్కున ఎత్తాటి పాలరాతి సమాది ఉండాది సూశావా?' అని వెంకటస్వామి కళ్లల్లోకి చూశాడు దానయ్య.

'ఆ కంచెకాడకదా—అమ్మాయి—అదేనా?'

చెయ్యెత్తి అటు చూపిస్తూ అన్నాడు వెంకటస్వామి.

'అదే. మా యమ్మ సచ్చిపోయి రెండు సంవత్సరా లవుతుండాది. ఆ పాలరాతి సమాధి పక్కనే పాతేసినాం. వెల్ల్రకితం ఈడకొచ్చి సూశిన. మాయమ్మ సమాధి ఆడనే వుండాది. ఇయ్యాళ సూత్తే ఆడలేదు.'

వెంకటస్వామి పాలోచనగా బీడీ దమ్ము లాగి పొగ వదులుతూ, 'ఆడలేదా?' చిన్నగా అడిగాడు.

'లేదు.'

'సరింగ సూశినావా?'

'ఆఁ'

'అసలు మీాయమ్మను పాతేసింది ఆడనో, ఆడకాదో నీకు బాగా తెలుసా?'

'నాకు బాగా గ్యాపకం, ఆడనే.'

'ఆడనే అవుతే ఉండకుండా ఏడకిపోద్ది? ఇదేమన్నా డబ్బా దస్కమా దొంగలెత్తుకు పోడానికి?' నవ్వబోయి గంభీరంగా ఉన్న దానయ్య ముఖంలోకి చూసి ఆగిపోయాడు వెంకటస్వామి.

'ఆ సంగతి నీకే తెలవాలి' అన్నాడు దానయ్య కోపాన్ని నిగ్రహించుకుంటూ.

'నాకా? ఏటి నువ్వనేది. నాకా?'

'నీకే'

వెంకటస్వామి లేచి నిలబడ్డాడు. బీడీ దూరంగా పారేసి పక్కకు తిరిగి తుపుక్కున ఉమ్మాడు. 'నాకేం తెలవదు' అన్నాడు.

దానయ్య కోపం మిన్నుముట్టింది. విసురుగా లేచి వెంకటసామి ఎదురుగా నుంచుని గొంతు పట్టుకున్నాడు. 'సెప్పు. నీకు తెలవదా?' నిలువెల్లా వణికిపోతూ అడిగాడు.

'నాయాలా నా గొంతట్టుకుంటూ వేట్రా ముందొదులు' పెనుగులాడుతూ అరిచాడు వెంకటస్వామి.

దానయ్య వీలు చిక్కనీయలేదు. ఒకచేత్తో వెంకటస్వామి గొంతుపట్టుకుని మరో చేత్తో గొంతు నొక్కసాగాడు. 'సత్తెం సెప్పకపోతే ఈడే నిన్ను సంపి పాతేసి పోతాను. నా సంగతి నీకు సరింగా తెలవదు కావాలు.' అన్నాడు.

వెంకటస్వామి గింజుకోడానికి ప్రయత్నించి విఫలు డయ్యాడు. గొంతు బిగుసుకుపోయి ఊపిరి ఆడడం లేదు.

'సెప్పు. నీకు తెలవదా?'

'.........'

'సెప్పకుంటే ...' గొంతు మరింత గట్టిగా నొక్కాడు దానయ్య.

వెంకటస్వామికి భయం వేసింది.

'సెబుతాగాని ముందొదులు' అన్నాడు.

'సెబితేనే గాని ఒదల్ను' పట్టు కొద్దిగా సడలించాడు దానయ్య.

'నేనే తీసినా'

'నువ్వా?'

'అవును.'

'ఎందుకు తీసినావు?'

'..........'

'తీసి ఏటిసేసినావు?' గొంతు గట్టిగా నొక్కాడు దానయ్య.

'నీకు దండం పెడతా ఒదులు. ఆ బొమికలు డాట్టరు కోర్సు సదువుతుండ బాబుకు అమ్మిన. అవ్వొ. సచ్చి పోతుండా. ఒదులు...'

దానయ్య నిరుత్తరుడయ్యాడు. వెంకటస్వామిని వదిలాడు. మౌనంగా గొంతు సవరించుకుంటున్న వెంకటస్వామి ముఖంలోకి కొద్దిసేపు పరీక్షగా చూశాడు. 'ఆ డాట్టరు బాబు దీ వూరేనా?' అడిగాడు.

వెంకటస్వామి తల వంచుకున్నాడు. 'ఏమో నాకు తెలవదు.' అన్నాడు

'నాతో పరాశికాలాడమాక. జైలుకు పోతే పోయిన గాని...నీ అంతు సూడకుండ నిన్ను ఒదుల్ను. ఆ డాట్టరుబాబుదీ వూరేనా అని అడిగిన.'

వెంకటస్వామి తలూపాడు.

'ఆ బొమికల్ని ఏకాడికి అమ్మినావు?'

'పది రూపాయలకు.'

'ఆ డాట్టరుబాబు ఉండేది ఏడనో నీకు తెలుసునా?'

వెంకటస్వామి తలెత్తి వెంటనే తల వంచుకున్నాడు.

'తెలవదా?'

'తెలుసు.'

'ఎల్లి అడిగితే తిరిగిత్తాడా?'

'ఏమో నాకు తెలవదు.'

దానయ్య కళ్లల్లో నీళ్లు తిరిగాయి. తల అడ్డంగా ఆడించాడు. 'నీకు ఈ పాడు పని సేయడానికి సేతులెలా ఒచ్చేయి?' గాద్గదికవౌతూన్న కంఠంతో అడిగాడు.

వెంకటస్వామి జవాబు చెప్పలేదు.

ఇంట్లోంచి మూలుగు హెచ్చు స్థాయిలో వినిపిస్తోంది.

ఆ మరుసటి రోజు రాత్రి పన్నెండు గంటలకు ఇంకా పది నిమిషాలుండగా —

పక్కలో తడుముతూ నిద్రపోతున్న మెడికల్ కాలేజీ హాస్టల్ 'దొంగ దొంగ', 'పట్టుకోండి.' 'తన్నండి'. — అనే కేకలకు ఉలిక్కిపడి నిద్రలేచింది. గదుల్లో లైట్లు ఒక్కటొక్కటే వెలుగుతున్నాయి.

దానయ్యకు భయం వేసింది. ఆ క్షణాలో ఏటు వెళ్లాలో ఆలోచించుకోలేదు. ఇప్పుడు ఆలోచించడానికి సమయంలేదు. వరండా చివరి వరకు వచ్చాడు. వరండాలో లైట్లు లేవు. చీకటిగా ఉంది. మెట్లమీాదుగా క్రిందకు చూశాడు. క్రింద వరండాలోని లైటు వెలుగుకు గచ్చు మెరుస్తోంది. దానయ్య గోడకు ఆనుకుని నుంచున్నాడు. కాళ్లు విపరీతంగా వణుకుతున్నాయి. హృదయం వేగంగా స్పందిస్తోంది. తల మీాదున్న చెక్కపెట్టె బరువుగా ఉంది. మెడ నొప్పిగా ఉంది. క్రింద నుండి గూర్ఖా వేస్తున్న విజిల్ ధ్వని కలకలంలో సరిగ్గా వినిపించడం లేదు. ఏం చేయాలో పాలు పోవడంలేదు. కొద్ది దూరంలో చప్పుడైంది. చూశాడు. ఇద్దరు. ఒకతని చేతిలో హాకీ బేట్, మరోతని చేతిలో ఇనుప చువ్వ ... ఇటే వస్తున్నారు. క్రిందకు వెళ్తే మంచిది. కాని...చాల మంది ఉంటారు. చూడకుండా ఉండరు. తనను చూడకపోతే మంచిదే ... కాంపౌండ్ గోడ దగ్గరగా ఉంది. దూకి రిక్శాలో వెళ్లిపోవచ్చు. వరండాలో ఒక్కో లైటు వెలిగిస్తూ ఇద్దరూ దగ్గరౌతున్నారు మరో పది అడుగులు వేస్తే...

దానయ్య హృదయస్పందన వేగంగా హెచ్చయింది. చెమట పడుతోంది. ఒక మెట్టు దిగాడు. క్రింద తిరుగుతున్న వాళ్ల కాళ్లు మెట్ల మీాదుగా కనిపిస్తున్నాయి. రెండో మెట్టు దిగాడు. హాకీ బేట్ టక టక దగ్గరౌతుంది. మూడో మెట్టు కాలికి ఆన లేదు. పెద్ద శబ్దం.

కొన్ని క్షణాల తర్వాత మెట్ల మీద లైటు వెలిగింది. చెక్కపెట్టెలోని ఎముకల్ని చివరి మెట్టుమీాదా, వరండాలో చిందరవందరగా పడి ఉన్నాయి. దానయ్య దేహం ముడుచుకుపోయి చివరి మెట్టు మీాదా తల వరండా మీాద ఉంది. కళ్ళు సగం తెరుచుకుని దూరంగా పడి ఉన్న చెక్కపెట్టెను చూస్తున్నాయి. 'అమ్మ, అమ్మ. అమ్మ... మాయమ్మ...' మాటలను నొక్కిపట్టి నోట్లోంచి రక్తం స్రవించి ఎముకల మధ్యకు లావాలా ప్రవహించి పోయింది.

# జీవనరాగం

## ఉన్నవ విజయలక్ష్మి

### జరిగిన కథ

ఇద్దరు అన్నయ్యలకి, ఇద్దరు అక్కయ్యలకి ముద్దుల తమ్ముడు నిరంజనం. అందరిలోకి నచ్చుగావున్నవాడు అతను. అతనికి భార్య పోవడంతో అత్తగారు సీతమ్మగారిదే యజమాన్యం. వసంత నిరంజనం కూతురు. పెద్ద కొడుకు మధు. పట్టభద్రురాలయిన అమ్మాయి సుధతో అతనికి పెళ్లవుతుంది. సీతమ్మగారికి జ్వరం వొచ్చి పడుకుంటే పనంతా సుధే చేయవలసి వస్తుంది. సీతమ్మగారి జ్వరం ఆమె ప్రాణాన్ని తీసుకుంది. వంటపనికి కాంతమ్మని పెట్టుకుంటారు. నిరంజనం గురించిన ఒక కొత్త కథని సుధకి చెబుతుంది కాంతమ్మ.

## 9

మార్చి నెల. మల్లెపువ్వులు ఇంకా వీధిలోకి అమ్మకానికి రావటం లేదు. మధు బజారులోంచి వస్తూంటే పూల దుకాణంలో సువాసనలను విరజిమ్ముతూ అప్పుడే విచ్చుకుంటున్న మల్లె దండలు కనిపించాయి. ఓ దండ కొని పొట్లం కట్టించుకు వచ్చాడు.

సుధ స్నానం చేసి వచ్చి, ధర్మవరం సిల్కు చీర జరీబుటాలు అందంగా కనిపించేలా కుచ్చెళ్లు పేర్చుకుని కట్టుకుంది. చీర అంచుకి మాచ్ అయిన బ్లవుజు. బొట్టు కాటుక అలంకరణ అంతా పూర్తి చేసుకుని అద్దం ముందు నిలబడి జడ అల్లుకుంటోంది.

రెండు చేతులలోనూ పూల పొట్లం వెనక దాచుకుని, 'నా చేతిలో ఏముందో చెప్పుకోవాలి' అన్నాడు మధు సుధ ప్రక్కగా నిలబడి.

'మీరు పాపం చాలా శ్రమపడ్డారు కాని ఆ పువ్వులు మీ రహస్యం దాచటం లేదు, మన పెరట్లో చెట్లు ఇంకా మొగ్గయినా తొడగలేదు. అప్పుడే పువ్వులు వచ్చేస్తున్నాయన్నమాట.' గబగబా మాట్లాడటం పూర్తి చేసి జడ వెనక్కి వేసుకుని పూల పొట్లం అందుకోబోయింది.

'ఇంతసేపటినుంచి చేతిలో పట్టుకున్నాను. కాస్తయినా పరిమళాన్ని పంచి పెట్టలేదు—నీకు మాత్రం గొప్పగా తమ సంగతి చెప్పేసుకున్నాయి. ఎంతయినా వీటికూ ఆడవాళ్లంటేనే పక్షపాతం' అంటూ తామరాకు సుధ చేతిలో పెట్టి మాల తల్లో సర్దేశాడు.

సుధ తృప్తిగా పువ్వులు చేత్తో తడిమి చూసుకుంటూ, 'నా ఆలశ్యం ఏంలేదు—మీరు బట్టలు మార్చుకుంటారా—ఆవిడికి చెప్పేసివస్తాను' అని వంటింటివేపు వెళ్లిపోయింది.

వచ్చడి రుబ్బుతున్న కాంతమ్మ సుధ చెప్పింది విని, 'అయితే ఎనిమిదిగంటలకి వచ్చేస్తారా?' అని అడిగింది.

'ఏమో చెప్పలేను. ఏడున్నరకి ముహూర్తం అంటున్నారు' వారికి బాగా స్నేహితులట మరీ బలవంతంచేస్తే భోజనానికి ఉండిపోతారేమో మా కోసం కూర్చోవద్దు. మామయ్యగారికి మామూలువేళకే వడ్డించేయండి.'

'మల్లెపువ్వులు కొన్నట్లున్నావే' తిరిగి వెళ్లిపోతున్నసుధ తలలో పూలవంక చూస్తూ అంది కాంతమ్మ.

'ఇంకా వీధిలోకి రావటంలేదు—బజార్లో కనిపిస్తే తీసుకొచ్చారు' తప్పుచేసిన దానిలా తెలతెలబోతూ సమాధానం చెప్పింది సుధ.

'నాకూ ఓ చిన్న దండ ఉంచక పోయావా?' తప్పుచేసిన చిన్నపిల్లని చనువుగా మందలించినట్లు అంది కాంతమ్మ.

సుధ మొహం చిట్లించింది. అదివరకు ఎప్పుడు పువ్వులుకొన్నా, పెరట్లో పూసిన వయినా కాంతమ్మకి కూడ ఇస్తూనే వుంది. ఇవాళ ఒక్కరోజు ఇవ్వకపోయినంత మాత్రాన అలా నిలదీసి అడుగుతూంటే, మొదట్లో కలిగిన జాలి తను తప్పుచేశానేమో నన్న భావం ఎగిరిపోయాయి.

'మరో పునిస్త్రీ వదుము ఇంట్లోవున్నప్పుడు పువ్వులన్నీ నువ్వే పెట్టేసుకోకూడదు. నీకు తెలియదని చెప్తున్నా— అసలు నాకెంత కావాలి, ఏదో శాస్త్రానికి ఇదిగో ఇంతంటే ఇంత 'దండచాలు,' చూపుడువేలిని బొటన వ్రేలితో రెండు భాగాలుచేసి ఆ కాస్తంత దండయినా చాలని చెప్పింది కాంతమ్మ.

'తనకిమాత్రం ఆ విషయం తెలియదూ. ఇవాళ అపురూపంగా దొరికిన పూలని భర్త ఆప్యాయంగా తెచ్చిందే కాకుండా సరదాగా తన జడలో అలంకరించేశాడు. తను సిగ్గుల పెళ్లికూతురిలా అతని చేతులలో ఒరిగిపోయింది— ఆ సమయంలో కాంతమ్మ మాట కాస్తకూడ గుర్తురాని మాట నిజమే — అయినా ఏదో పెద్ద పొరపాటు చేసినట్లు నిలదీసి అడగటం, శ్రీరంగనీతులు చెప్పటం ఏమిటి ? కొద్ది క్షణాల క్రిందట పారవశ్యం లోని మధురిమని తన మనస్సులోని ఆహ్లాదాన్ని పూర్తిగా ధ్వంసం చేసేసింది — పానకంలో పుడకలా, ఛీ—' అంతటి విసుగుని లోలోపలె అణుచుకుని ఏమీ అనకుండా వెళ్లిపోయింది.

కాంతమ్మ తనతో చనువుగా వుండటం సుధ కెప్పుడూ ఇష్టంలేదు. వాళ్లిద్దరి మధ్యా వున్న అంతరం అనుక్షణం ఆ అమ్మాయికి గుర్తు వుంటూనే వుంటుంది — అయితే మామగారిని గురించి కాంతమ్మ ఆ రహస్యం చెప్పిన తరువాత మాత్రం - సుధ ఓ విధమైన బలహీనతకి లొంగిపోయింది. దానికి సంబంధించిన వివరాలు ఇంకా తెలుసుకోవాలనే కుతూహలం కలిగింది — కాని పనివాళ్లతో అంతరంగిక విషయాలు మాట్లాడ కూడదు అని తనని తనే హెచ్చరించుకుని మనస్సుని అదుపులో పెట్టుకుంది — అయినా, తనకై తను అడగకపోయినా ఎప్పుడయినా కాంతమ్మ మళ్లీ ఆ ప్రసక్తి తీసుకువస్తే వినాలనే ఆసక్తిని మాత్రం చంపుకో లేకపోయింది — అందుకే

మరీ అంటే ముట్టనట్లుగా వుండలేక పోయింది. అయితే ఇటీవల జరిగిన సంఘటన, అదే ఏ కారణంతో నయినాగాని తన గదిలోకి కాంతమ్మ రాబోవటం ఆ అమ్మాయి అప్రసన్నతకే కాకుండా అనుమానానికి కూడ దారితీసింది — అందుకే ఆ నాటినుంచీ కాస్త ముభావంగానే వుంటోంది.

అది అంతా ఇంకా సుధ మనస్సులోంచి మాసిపోకుండానే అర్థంలేకుండా ఈ పువ్వుల గొడవ తెచ్చింది. సుధ మనస్సు చాలా ఉదాసీనంగా అయిపోయింది. కాంతమ్మ రోజు రోజుకీ తీసుకుంటున్న చనువు ఆవిడ మాటల ధోరణి ఏమిటో అంతుపట్టటం లేదు. ఏమయినా సాధ్యమైనంత త్వరలో ఆవిడ్ని పంపించేస్తేనే బాగుంటుంది, అన్న ఉద్దేశ్యం కలిగింది ఎందుకో.

హుషారుగా ఉత్సాహంగా లోపలికి వెళ్లిన సుధ నీళ్లు కారిపోయినట్లు, మ్లాన వదనంతో ఉసూరుమంటూ ఇవతలికి రావటం గమనించి, 'అలా వున్నావేం. ఆవిడేమయినా అందా ?' అన్నాడు మధు మామూలుగానే.

అసలే లోలోపల ఉడికిపోతున్న సుధ పైకి కస్సుమంది, 'ఆవిడ నన్నేమంటుంది ? అంటే తక్షణం తలవారిన తనని పొమ్మంటాను.'

ఏదో జరిగిందని గ్రహించుకున్న మధు 'సరే రా వెళ్దాం.' అంటూ దారితీశాడు.

'ఆవిడికి పువ్వు ఇవ్వలేదని కోపంవచ్చింది' వీధిలో నడుస్తూ చెప్పింది సుధ.

'నిజంగానా? నా కసలు ఆ ధోరణే లేదు. లేకపోతే మరోదండ తెచ్చేవాడిని' మామూలు ధోరణిలో అన్నాడు మధు.

'చాల్లెండి. ఆవిడ తల్లోకూడ పెడతా ననలేదు...'

చిత్రంగా భార్యమొహంలోకి చూసి ఏం మాట్లాడకుండా ఊరుకున్నాడు.

కాస్సేపటి తరువాత సుధే మళ్లీ అంది. ఈ కాంతమ్మ పద్ధతి నాకేమిటో నచ్చటం లేదు. తను మనింట్లో కేవలం పనిచెయ్యటానికి వచ్చాననే సంగతి మరచిపోయి అక్కర్లేని విషయాలన్నింటిలోనూ కలుగజేసుకుంటుంది- మనిషిలో మర్యాదా పెద్దమనిషి తరహా అవీ ఏమీ లేవు. ఇంత పౌడరు పూసుకుని సిగచుట్టూ మల్లెపువ్వులు పెట్టుకుని పురాణం వినటానికి వెళ్తే చూసిన వాళ్లు నలుగురూ ఫలానావారింట్లో వంటావిడ అని చెప్పుకుంటేకూడ మనకి ప్రతిష్ఠ'

'నీ ఇష్టం. అక్కర్లేదనుకుంటే వెళ్లిపొమ్మను. పనిపాటలన్నీ చేసుకోవలసిన దానివి నువ్వు. నీ ఓపిక చూసుకో' అన్నాడు మధు, ఇంకేమనాలో తెలియక.

'అదే ఆలోచిస్తున్నాను. అన్నింటికి సరదా పడినంత మాత్రాన అహార్నాలు చేస్కోటం మంచిది కాదేమో అనిపిస్తుంది ఒకోసారి' పెళ్లివారిల్లు దగ్గర పడటంతో సంభాషణ ఆగిపోయింది.

పది దాటుతూంటే భార్యాభర్తలు ఇంటికి తిరిగి వచ్చారు.

మర్నాడు మగవాళ్లు భోజనాలుచేసి ఎవరి



## 18 CLUES

1. As the history of the world abundantly proves power when it is wielded too long corrupts even men of discrimination and **Ability / Nobility.**
2. **Beauty / Duty** and love must go together.
3. The developement of **Cultural / Ethical** values and mastery of the physical world are both necessary for the progress of man kind.
4. It is the very nature of the ego to know itself as **Everything / Existing.**
5. A society truly free from **Exploitation / Privation** can be created only through non-violence.
6. Make **Food / Money** available in plenty, make it cheap and you lay the foundation of a sound economy for the country.
7. One should never depend on others for one's **Happiness / Success.**
8. **Humanity / Morality** has all its force only when it is intimately connected and ultimately rooted in religion.
9. In India it is the **Indivisibility / Universality** and impersonality and not the finitude and separation of the self that are posited.
10. Self-conquest is the real conquest, abstinence from **Indulgence / Violence** is real strength.
11. Indeed the question of war and peace involves a profound **Moral / Spiritual** issue for mankind.
12. The common man of India, illiterate, poor, exploited as he is, is still a **Noble / Whole** man.
13. A philosophy which draws inspiration exclusively from the past scriptures cannot free a country from the evils of the **Past / Present**
14. We should not forget that religion is something immensely **Personal / Practical.**
15. Everything in fact that a scientist discovers has a **Philosophical / Spiritual** meaning
16. No sentiment is more spontaneous in its origin than the **Racial / Religious** sentiment, more persistent throughout human history and more far-reaching in its influence
17. Were **Rationality / Spirituality** to guide our destiny wars would have become extinct long ago.
18. The world offers us many pleasant things no doubt. But they never give us **Satiety / Tranquility.**

గమనిక : పై క్లూలు గ్రంథకర్తలు, రచయితల పుస్తకములనుండి తీసుకొనబడినవి. అవి పూర్తి వాక్యములు మరియు వేరువేరుగా పూర్తి అర్థవంతమైనవి. గ్రంథకర్తలు రచయితల పేర్లు, వారి పుస్తకముల పేర్లు అఫిషియల్ సొల్యూషన్‌తోపాటు **లిట్ క్విజ్ పేజీలో** ప్రచురించబడును.

## లిట్ క్విజ్ నెం. 26 నకు తెలుగు తర్జుమా

1. ప్రపంచచరిత్ర విస్తారంగా నిరూపించుచున్నట్లు, అధికారంఅమితమై నదీర్ఘకాలంనిర్వహించబడునపుడు వివేకము మరియు సామర్థ్యం/కులీనత గలవ్యక్తులు సహితం లంచగొండితనపు దుర్నడత వశులౌతారు.
2. సౌందర్యం / కర్తవ్యం మరియు ప్రేమ ఐక్యమై యుండవలెను.
3. మానవాభ్యుదయానికి అభివృద్ధి బొందిన సాంస్కృతిక / నైతిక విలువలు మరియు నైతిక సృష్టి సాధన రెండును అవసరం.
4. మహత్వపూర్ణం / అస్తిత్వపూర్ణం తన కెరుక అనుకొనుటయే అహం యొక్క స్వభావం.
5. నిజంగా శోషణ / లేమి రహితమైన సమాజం అహింస మూలంగానే సృష్టింపబడగలదు.
6. ఆహారం / ధనం సమృద్ధిగాను చౌకగాను లభింపజేయుండి, అప్పుడు మీరు దేశం కోసం సరియైన ఆర్థికాభివృద్ధికి పునాదివేసినవారగుదురు.
7. తన ప్రసన్నత / సఫలత నిమిత్తం అన్యులపై వాధారపడరాదు.
8. మానవత్వానికి / నీతికి మతంతో సన్నిహితంగా సంబంధించియుండి తుదకు పాతుకొనిపోయినపుడే సంపూర్ణ శక్తి కలుగుతుంది.
9. భారతదేశంలో ఆత్మయొక్క అఖండత / సర్వవ్యాప్తికత మరియు వ్యక్తిశూన్యత యదార్థంగా పరిగణింపబడును, సంకీర్ణత మరియు వ్యక్తి వియోగత అట్లు కావు.
10. ఆత్మవిజయం అసలైన విజయం. యథేచ్ఛానడత / హింసా రాహిత్యం అసలైన శక్తి.
11. నిజంగా యుద్ధం మరియు శాంతి అనే ప్రశ్న మానవ కోటిని గాఢమైన నైతిక / ఆధ్యాత్మిక సారాంశపు చిక్కులో ముంచేస్తుంది.
12. భారతదేశ మందలి సామాన్య మానవుడు, విద్యావిహీనుడై, పేదయై, శోషితుడై యున్నప్పటికిన్ని ఉదాత్తుడు / పరిపూర్ణుడు అయి వున్నాడు.
13 ప్రాచీన వేదములనుండి ప్రత్యేకంగా సేకరించిన దైవజ్ఞాన ప్రేరితమైనట్టి వంటి తత్వజ్ఞానము గత / ప్రస్తుత కీడులనుండి దేశమును విముక్తి చేయజాలదు.
14. ధర్మము వ్యక్తిగతమైనది / వ్యావహారికమైనది అని మనము మరువరాదు.
15. వైజ్ఞానికుడు కనిపెట్టిన ప్రతివిషయమున్ను తత్వజ్ఞాన / అధ్యాత్మిక అర్థమును గలిగియున్నది.
16. ఏభావమున్ను దానిమూలమందు వర్ణాత్మక / ధార్మిక భావముకంటె ఎక్కువ సహజపూర్వమైనది కానేరదు. మానవ ఇతిహాసంలోను ఎక్కువ హఠపూర్వకమైనది మరియు దాని ప్రాబల్యతలో ఎక్కువ గాఢమైనది కానేరదు.
17. వివేకం / ఆధ్యాత్మిక జ్ఞానం మన స్థితిగతులకు మార్గదర్శికమైయుంటే చాలాకాలం క్రితమే యుద్ధములు నశించియుండెడివి.'
18 ప్రపంచం మనకు అనేక మనోహరమైన వస్తు సముదాయమును సమకూర్చుచున్నది సందేహం లేదు. కాని, అవి మనకెప్పుడున్ను సంతృప్తిని / శాంతిని కలిగించుటలేదు.



దారిన వాళ్ళు వెళ్ళిపోయారు. ఆడవాళ్ళిద్దరూ వడ్డించుకుని కూర్చున్నారు.

'సుధమ్మా,, నేనోమాట చెప్తానుగాని, ఏం అనుకోకేం.' అంది కాంతమ్మ ఉపోద్ఘాతంలా.

నోట్లో పెట్టుకోబోతున్న ముద్ద అలా చేతిలో పట్టుకునే, 'చెప్పండి. నేనే మనుకుంటాను' అంది. మళ్ళీ ఏంచెప్తుందోఅని గుండెలు పీచుపీచు మంటున్నాయి.

'ఇప్పట్నుంచి నేను వండేసి పోతాను. వడ్డన నువ్వు చూసుకో.'

'అదేం ?'

'వాళ్ళిద్దరూ ఒక పంక్తికేవస్తే ఫరవాలేదు. మీ మామగారికి ఒక్కరికీ వడ్డించాలంటేనే నా కేమిటో భయంవేస్తోంది—'

వింటున్న సుధ పై ప్రాణాలు పైనే పోయాయి—మామగారు అసభ్యంగా మాట్లాడతారన్నా ప్రవర్తిస్తారన్నా తనకెందుకో నమ్మకం కలగటంలేదు. మరి ఈ కాంతమ్మ చెప్తున్న దేమిటి ? పరువు మర్యాదగా బ్రతుకుతున్న కుటుంబాన్ని బజారులో పెట్టేలాగుంది. ఇంక ఏమయినా సరే తను ఈవిడ్ని భరించలేదు. ఒక్కసారి మధుతో కూడ సంప్రతించి ఆవిడికి ఉద్వాసన చెప్పేయాలి...

'మళ్ళీ ఎవరితోనూ అనకుసుమీ పాపిష్టిలోకం - ఉన్నవీ లేనివీ కల్పిస్తుంది. మనం జాగ్రత్తగా వుంటే ఎవ రెలాంటివా రయినా ఫరవాలేదు.' అంటోంది కాంతమ్మ.

సుధ మౌనంగానే ఏదో తిన్నాననిపించి లేచి వెళ్ళిపోయింది ఎప్పుడు సాయింకాలం అవుతుందా, ఎప్పుడు మధు సలహా తీసుకుందామా అన్నట్లు రోజంతా గడిపింది.

'టిఫిన్ ఏంచెయ్య మంటావు ?' అని గుమ్మందగ్గరే నిలబడి అడిగిన కాంతమ్మకి,

'ఏదో ఒకటి చెయ్యండి' అని సమాధానం చెప్పి, మనస్సంతా చిరాగ్గా ఉన్నా ఎలాగో తల దువ్వుకుని మొహం కడుక్కొ వచ్చింది.

'బొట్టు పెట్టుకురా కాఫీ తాగుదువుగాని, రోజూ వేళదాటి పోయింది — నేను చెప్పింది కడుపులో పెట్టుకో. అంతేకాని దాన్నిగురించే ఆలోచించకు' అని కాఫీ తీసుకు రావటానికి వంటింట్లోకి వెళ్ళింది కాంతమ్మ.

# జీవనరాగం

మధు వచ్చాడు. అతను బట్టలు మార్చుకుని కాళ్ళు కడుక్కువచ్చేదాకా ఓపిక పట్టాలి అనుకున్న సుధ పుస్తకం తిరగేస్తూ కూర్చుంది.

అంతలోనే నిరంజనం వచ్చాడు. ఎప్పుడూ లేనిది అతని గొంతు వింటూంటే సుధ గుండెలు దడదడ లాడాయి. మరుక్షణంలోనే అతనిపట్ల సానుభూతితో అభిమానంతో ఆ అమ్మాయి అంతరంగం నిండి పోయింది.

ఎప్పటిలా తండ్రికొడుకులు టిఫిన్ ముగించి కాఫీ తాగారు. కాస్సేపు కబుర్లు చెప్పి మధు గదిలోకివచ్చాడు. అప్పటికి ఓ నిర్ణయానికి వచ్చినదానిలా.

'నాకీ కాంతమ్మనిచూస్తే భయం వేస్తోందండీ.' అంది సుధ మెల్లిగా.

'ఆవిడ్ని చూస్తే భయం ఎందుకు ?'

'అబ్బ మీతో ఇదోగొడవ, త్వరగా అర్థం చేసుకోరు.'

'అయితే అర్థం అయేలా చెప్పుమరి.' కుర్చీ చేతిమీద మోచెయ్యి ఆనించి అరచేతిలో గడ్డం ఆన్చుకుని తాపీగా కూర్చున్నాడు.

'అదేనండీ — ఆవిడికి మీ నాన్నగారిని చూస్తే భయం వేస్తోందిట.'

'భేషుగ్గా వుంది—ఆవిడికీ మా నాన్నగారినిచూస్తే భయంవేస్తోందీ — ఆవిడ్ని చూస్తే నాకు—' హాస్య ధోరణిలో మొదలుపెట్టి అర్థోక్తిలోనే ఆగిపోయాడు. అతని కనుబొమలు ఆలోచిస్తున్నట్లు ముడుచుకున్నాయి. ఆ వెంటనే మొహం నిండా బాధా వీచికలు అల్లుముకున్నాయి. ఇంకో క్షణంలో కోపంతో అది జేవురించింది.

'అబద్ధం నేను నమ్మను.' అన్నాడు కళ్ళ వెంట నిప్పులు కురిపిస్తూ.

'నేనుమాత్రం నమ్మానా-మనకి తెలియక పెట్టుకున్నాం గాని ఈవిడో చిత్రాంగిలా వుంది. ఇంటిమీదికి ఏంతెస్తుందో నని భయం వేస్తోంది— ఇంట్లోవున్న ముగ్గురికి ఒకరి కొకరికి పొందకుండా చేసి, చివరికి మనిద్దరి మధ్యాకూడ కలతలు రేపెట్టగల చాకచక్యం ఉన్నట్లుంది-'

'మరయితే తీసేయక పోయావా ?'

'చెప్పానుగా మొన్నే ఆ ఆలోచనవచ్చింది. అయినా కొన్నాళ్ళు చూద్దామని వూరుకున్నాను. ఇవాళ్టితో మరీఅసహ్యంపుట్టింది — ఇంక ఈవిడ్ని నేను భరించలేను.'

'వెంటనే పంపెయ్యను. మరి ఆలస్యం చెయ్యకు.'

'హఠాత్తుగా చెప్తే బాగుంటుందా అని—'

'ఏం, ఒన్‌మంత్సు నోటీస్ ఆర్ దెన్ సైడ్ అంటూ రూల్సు మాట్లాడుతుందా' ఆవిడపేరు చెప్తేనే అతని పళ్ళు మండిపోతున్నట్లుంది.

'అలా కాదనుకోండి. హఠాత్తుగా ఎక్కడికి పోతానంటుందేమో.' నసిగేసింది సుధ.

'ఎక్కడికి పోయినా సరే — ఇవాళ ఆరో తారీకు కదా. ఏకంగా నెలజీతం ఇచ్చేసేయి. ఇంక అప్పుడేమనదులే.'

'ఏం కారణం చెప్పను ?'

'అబ్బబ్బ ఏదో నీనోటికి వచ్చింది చెప్పు. నాతో అడ్డంగా వాదిస్తావు కాని వంటమనిషికి సమాధానం చెప్పలేవు' విసుక్కుంటూ తల పట్టుకుని కుర్చీకి జారగిలపడ్డాడు.

డబ్బు తీసుకుని వంటింట్లోకి వెళింది సుధ, కూరల బుట్టముందు పెట్టుకు కూర్చున్న కాంతమ్మ,

'నువ్వు వదుకున్నావని జాజిపువ్వులు కట్టేశాను - నీకొ వళ్ళెంలో పెట్టాను తీసుకో.' అంది తన సిగమీద తుంచి జారిపోతున్నమాలని వయ్యారంగా సర్దుకుంటూ.

కాంతమ్మ ప్రతిమాట ప్రతి చర్య ఎబ్బెట్టుగానే అనిపిస్తున్నా యిప్పుడు సుధకి.

'నేనివ్వటం నువ్వు తీసుకోటం అన్నీ పోయాయి. నన్నో చిన్నపిల్లని చేసి నీ ఇష్టం వచ్చినట్లు ఆడించాలనుకుంటున్నట్లున్నావు. వచ్చిననాడు అంత అమాయకంగా కనిపించావు కాని ఎంత నాటకం అయినా ఆడగల జాణవి మామయ్యగారిమీద లేనిపోనివి కల్పించి చెప్పి ఆయనంటే నాకు అనుమానం అసహ్యం కలిగించాలని చూశావు. ఆ పైన నువ్వేంచెప్పినా నేను నమ్మేస్తానను కున్నావు కాబోలు— నయం అవాళ నీ మాటలు పట్టుకుని తెలివి తక్కువగా అడిగి వారి మనస్సుకూడ నొప్పించాను కాదు.' మాటా మంచీ లేకుండా నిలబడిపోయిన సుధ కళ్ళల్లోకి ఆసక్తిగా చూస్తూ, 'వంటేం చేయమంటావు' అంది కాంతమ్మ.

'ఈ పూటకి ఏదో ఒకటి చెయ్యండి — రాత్రి భోజనంచేశాక మీరు వెళ్ళిపోండి. రేపట్నించి మాకు అక్కర్లేదు.'

సుధ ఇంకేదో చెప్తుంది అనుకున్న కాంతమ్మ తెల్లబోయి 'అదేమమ్మా అలా అనేస్తున్నావు.' అంది.

'మా చెల్లాయికి పెళ్లి నిశ్చయంఅయింది రేపు నేను వూరికి వెళ్తున్నాను.— మొగ వాళ్లిద్దరూ ఏ హోటల్లోనో తింటారు కొన్నాళ్లు — శలవు లివ్వగానే అందరం కలిసి మైసూరు అవీ చూసి రావాలను కుంటున్నాం —మళ్లీ మేం తిరిగివచ్చాక, అవసరంఅయితే కబురువంపుతా లెండి.' అబద్ధం ఆడటం చేతకాని సుధకిమాటలు తడబడ్డాయి. అయినా చెప్పదలచుకున్నది ఎలాగో పూర్తి చేసింది.

'నువ్వు లేకపోతేఏం వాళ్లిక్కడున్నన్నాళ్లు వండి పెట్టమంటే పెడతాను. హోటల్ భోజనంతో ఇబ్బంది పడటం ఎందుకు-అయినా నీ మామగారు ఎక్కడికో వెళ్లినట్లున్నారు ఆయనతో కూడ చెప్పావా?'

సుధకి వళ్లంతా తేళ్లూ జెర్రెలూ పాకి నట్లయింది. 'ఎలాగో సర్దుకుంటారుట వాళ్లిద్దరూ చెప్పమంటేనే చెప్తున్నాను.' అంది విసుగ్గా కాంతమ్మ కళ్లలోకిచూస్తూ.

'మరి ఇంత హఠాత్తుగా పొమ్మంటే ఎలా ?'

అసలు సుధకి సహనం తక్కువ. కాంతమ్మని చూస్తే పొద్దుటినుండీ వళ్లు మండి పోతోంది—దానిపైన ఇప్పుడే అడ్డదిడ్డం ప్రశ్నలు — 'మాకూ ఇవాళే ఉత్తరం వచ్చింది. అంతవరకూ ఈ ప్రయాణం సంగతే అనుకోలేదు — ఈ నెలకి పూర్తిగా జీతం ఇచ్చేస్తున్నా లెండి' తెచ్చి పెట్టుకున్న మర్యాదతో శాంతంగానే జవాబుచెప్పి నోట్లు అందించబోయింది.

'సరే మీ ఇష్టం. ఇంక ఆ మాత్రానికి ఈ పూట వంటకూడ ఎందుకూ. చీకట్లో ఏం అవస్థపడతాను, ఇప్పుడే పోయి మళ్లీ ఆ సుబ్బయ్యగారి పంచలోనే కాస్త జాగా అడుక్కుంటాను. అంటూ నోట్లు గుంజుకుని కూరల బుట్ట ఓ మూలకీ, కత్తిపీట మరో మూలకీ తోసేసింది కాంతమ్మ.

'ఇదుగో నమ్మాయి అవాళ నువ్విచ్చిన చీర జాకెట్టు' అంటూ మొదటిరోజున సుధ ఇచ్చిన చీర పింజెపెట్టి పీటమీద పెట్టింది.

'ఛ. ఎంత నిజాయితీగల మనిషయితే మాత్రం తను కొన్నాళ్లు కట్టుకున్న చీర నా కిస్తాననటుందా. చీర తీసుకోమంటారా అని అడిగితే ఎంత బాగుండేది,' అనుకుని 'ఫరవాలేదు అది మీరు తీసుకోండి' అంది సుధ.

(ఇంకా ఉంది)




'ఏమండోయ్, నమస్కారం.—'

'నమస్కారం.— చాలా కాలానికి కనబడ్డారూ......'

'ఏవరీ అబ్బాయ్.— మీవాడేనా —'

'అవునండి.'

'ఏం చేస్తున్నట్టూ —'

'ఇంకా మేంలేదండి.'

'ఎంతవరకూ చదవాడూ?'

'ఆ— ఏదో, స్కూల్ ఫైనలు.'

'ప్లైపు వచ్చా?'

'నేర్చుకుంటున్నాడు.'

'షర్టెండూ?'

'ఉహు— రాదండి'.

'పైకి చదివించలేకపోయ్యారూ?'

'పెద్ద చదువులు మనకెందుకులెద్దురూ!'

'పోనీ, ఏదన్నా టెక్నికల్ లైన్లో పెట్టలేక పోయారా?'

'మావాడు కంపోసిట్ కాడు.'

'అలాగా—సర్వీస్ కమిషనుకి కట్టించలేక పోయారా?'

'మద్రాసులో తెలుగువాడ్ని రానివ్వరు కదండీ?'

'పోనీ, ఆంధ్రాకి కట్టించేది— ?'

'దూరాభారం— చూసిచూసి పంపలేక్పండా వున్నాం.'

'ప్రయివేటుగా ఎక్కడైనా చూళ్లేకపోయారా?'—

'చూస్తూనే వున్నా— మీ ఎరికినేదైనా వుంటే చెప్పుదురూ.—'

'ఆ—అన్నట్టు—మావాడూ ఒహడు ఖాళీగా వున్నాడండీ—స్వయానా వాళు బావమరిది...'

'ఏం చేస్తున్నాడూ?—'

'ఖాళీగా ఉన్నాడంటే ?—'

'ఏం చదివాడూ?—'

'ఎస్సెల్సీ తప్పాడు.'

'ప్లైపు వొచ్చా?'

'రాదండీ.

'షర్టాండూ?'

'టైపేరాదంటే, షార్టెండేవిటి?—'

'పైకి చదివించలేక పోయారా?—

'స్కూలు ఫైనలే తప్పాడంటే.....?'

'పోని, టెక్నికల్ లైనుండగా?

'వాడికి తెక్కలు నున్నండీ.

'అయితే— సర్వీసు కమిషనా........?'

'గవర్నమెంటు ఉద్యోగమంటే మాఆవిడ సహేమిరా వప్పదు.'

'ప్రైవేటు కంపినీలు బోలెడున్నాయికదా, దేంట్లోనేనయినా....?'

'నేనూ చూస్తూనే వున్నానండీ,— మీ కెదేనా తెలిస్తుంటే, కాస్త.....?'

'ఆ— అలాగ్గే, తప్పకుండా. మావాడి సంగతి మాత్రం మరిచిపోకండేం?—'

'ఆ— ఆ— ఎంతమాటా?— మీవాడిమాట గుర్తుంచుకోండి.—'

# రెండు ఇంగ్లీషు నాటకాలు

డిసెంబరు 12 నుంచి 15 దాకా మదరాసులో రెండు ఇంగ్లీషు నాటకాల ప్రదర్శనలు జరిగాయి. వాటిని ఏర్పాటు చేసిన సంస్థ బ్రిటిష్ కౌన్సిల్. నాటకాలని వేసినది కేంబ్రిడ్జ్‌కి చెందిన ప్రాస్పెక్ట్ ప్రొడక్షన్స్ లిమిటెడ్.

*　　*　　*

ఈ ప్రపంచంలో 'నిజమయిన ఇంగ్లీషు వారు' మిగిలితే వారు ఇండియన్లే అయి ఉంటారని మాల్కమ్ మగ్రిడ్జ్ ఒకసారి అన్నాడు. 'మేధావుల'లో కూడా విక్టోరియన్ ధోరణులు మన దేశంలో ఉన్నంత ప్రబలంగా బ్రిటన్‌లో కూడా ఉండవనే అనుమానానికి శ్రీ మగ్రిడ్జ్ అభిప్రాయమే నిదర్శనం. బెర్నార్డ్ షా రాసిన 'మిస్ ఎలయన్స్' విద్యాభ్యాసాన్ని వస్తువుగా తీసుకున్న నాటకం అని చదువుతాము, వింటాము. ఆయన ఈ నాటకం కోసం రాసిన ప్రిఫేస్ లేక ముందుమాట బ్రిటన్‌లో విద్యాభ్యాస పద్ధతులని తీవ్రంగా, ఎంతో చక్కగా ఖండించాడు తమ పిల్లలపట్ల తలిదండ్రులు చూపే అశ్రద్ధ గురించి విపులంగా రాశారు బ్రిటన్‌లో విద్యాభ్యాసం—అందులోనూ షా కాలంలో అమలులో ఉన్న పద్ధతులు— ఈ కాలంలో, మదరాసులో చూస్తున్నవారికి అంత ముఖ్యమయిన విషయంగా తోచకపోవచ్చు, నిజానికి అది చాలా ప్రస్తుతమయిన విషయం కాని 'మిస్ ఎలయన్స్' చూడటానికి వచ్చినవారిలో ఎక్కువమందికి దానిని పట్టించుకోవాలని అనిపించి ఉండదు, అనిపించిన కొద్దిమందికీ చెయ్యవలసిన దేమిటో తోచి ఉండదు అయినప్పటికీ, 'మిస్ ఎలయన్స్' అంతమందిని సంతోషపెట్టగలిగిందంటే షా ప్రతిభకి, భావనాశక్తికి ఇది మరొక నిదర్శనం, ప్రేక్షకులలో పెద్ద అలజడి తీసుకురాలేకపోయినదంటే 'నిజమయిన ఇంగ్లీషతనం' ఇక్కడ ఎంత నిబ్బరంగా ఉందో తెలిసేందుకు కూడా నిదర్శనం—కావచ్చు!

'మిస్ ఎలయన్స్' కథ చాలామందికి సుపరిచితమే అయి ఉంటుంది అండర్‌వియర్ తయారీద్వారా డబ్బుచేసిన ఒక కుటుంబంలోని తెలివిగల ఒక అమ్మాయి అతి 'దుర్బలు'డయిన ఒక 'అభిజాత్య వంశ'పు యువకుడికి 'ఎంగేజ్' అయి ఉంటుంది ఈ అమ్మాయి తండ్రి గట్టివాడు. తల్లి గడుసుగా కబుర్లు చెప్పగలవ్యక్తి, సోదరుడు కొంచెం మొద్దబ్బాయి, చెల్లెలి 'ఎంగేజ్‌మెంట్'ని ఆమోదించడు. ఒకరోజు వారి ఇంటి ఆవరణలో ఒక విమానం కూలి పడుతుంది, దానిలోనుంచి పెద్దమనిషి అనిపించుకోవాలనుకునే ఒక యువకుడూ, సర్కస్ వృత్తి నేర్చుకున్న ఒక పోలిష్ అమ్మాయీ దిగుతారు ఇంటివారి అమ్మాయి ఈ యువకుడి వెంట పడుతుంది మొగవారందరూ పోలిష్ అమ్మాయిని చూసి నిలకడ కోల్పోతారు—'దుర్బల యువకు'డి తండ్రి అంతకిముందే తనకాబోయే కోడలుపట్లా ఈ యువతి పట్లా ఆకర్షింపబడుతాడని సంభాషణలద్వారా తెలుస్తుంది చివరికి ఇంటివారమ్మాయి విమానచోదకుడిని దొరికించుకుంటుంది పోలిష్ యువతి ఆ అమ్మాయికి ఎంగేజ్ అయిన అబ్బాయిని తీసుకు



'మిస్ ఎలయన్స్' నాటకంలో ఇన్‌గ్రిడ్ హాఫ్‌నర్ (హిపాటియా టార్లటన్), మోనా వాష్‌బోర్న్ (శ్రీమతి టార్లటన్), అన్ థ్రూషే (బెన్‌ట్లీ సమ్మర్‌హేస్), మార్టిన్ విల్‌డెక్ (శ్రీ టార్లటన్), టిమ్ ప్రిన్ (ఒక వ్యక్తి)

పోతుంది. తను చూసిన పురుషులంతా తనని ప్రణయంలోకి దింపటానికి తప్ప వేరే ప్రయత్నం చెయ్యలేదని కోప్పడుతూ.

వేదికమీద సెట్టింగులు వగయిరా ఆకర్షణీయంగానే ఉన్నా వేషాలు వేసేవారి ప్రదర్శనలే నాటకానికి ముఖ్యాకర్షణ. ఒక సుప్రసిద్ధ సాహిత్య చరిత్రకారుడు అన్నట్లు 'నాటకం నిర్మాణానికి తోడ్పడేవారిలో రచయిత ఒకడు. అంతే' స్టేజిమీద నాటకం చూడటం వేరు. పుస్తకంలో చదవటం వేరు. అండర్వియర్ పారిశ్రామిక వేత్తగా డాన్వర్స్వాకర్. అతని భార్యగా మోనావాష్బోర్న్, (మధ్య హటాత్తుగా పగ దీర్చుకొనటానికి ప్రవేశించి ఇంటివారమ్మాయి ... బయటపెట్టిన వ్యక్తిగా వేసిన టిమ్ (పేస్), సర్కస్ అమ్మాయికి దక్కిన యువకుడుగా వేసిన ఆండ్రూ రే— వీరి నటన తక్కినవారి నటనకన్నా బాగున్నదనే అభిప్రాయం ఈ విలేఖరికి కలిగింది. (ఒక చిన్న వింత—స్టేజిమీద ఏదయినా రాయ వలసివచ్చినప్పుడు అందరూ ఎడమచెయ్యినే వాడారు. అది నిజమయిన అలవాటో లేక స్టేజి-అలవాటో తెలీదు!)

రెండవనాటకం 'ది బర్త్ డే పార్టీ' అసలయిన సిసలయిన ఆధునిక నాటకం. మధ్య వయస్కులయిన ఇద్దరు భార్యాభర్తలతో పాటు స్టేన్లీ వెబర్ అనే లాడ్జర్ కూడా ఉంటాడు. ఇతనికి కళ్ళు సరిగ్గా కనిపించవు. ఒకప్పుడు పియానో వాద్యగాడినని చెప్తాడు. ప్రస్తుతం ఏమీ చెయ్యకుండా తన 'ఆంతరంగిక ప్రపంచం'లో మునిగిపోయి ఉంటాడు. ఇంటావిడ తన మామూలు తెలివితక్కువ ధోరణిలో అతనిలో మురుకుదనం కల్పించాలని ప్రయత్నించి విఫలురాలవుతూ ఉంటుంది. ఒకనాడు, హఠాత్తుగా, ఇద్దరు కొత్త లాడ్జర్లు వస్తారు. ఇద్దరిలో ఒకడు మధ్య వయస్కుడు (గోల్డ్బర్గ్), రెండవవాడు యువకుడు. గోల్డ్బర్గ్ కూడా స్టేన్లీతో 'స్నేహంగా' ఉండాలని చూస్తాడు; రెండవ మనిషి మెక్కాన్ అతనిని అవజ్ఞతో చూస్తాడు. వారు వచ్చినరోజు స్టేన్లీ పుట్టినరోజు, అని ఇంటావిడ చెప్పగా, అతనికోసం చిన్న పార్టీ ఏర్పాటు చేస్తాడు. స్టేన్లీ అయిష్టంగానే ఇందులో పాల్గొన వలసివస్తుంది. ఆగంతకు లిద్దరూ స్టేన్లీని దువ్వుతున్నట్లు ప్రవర్తిస్తూ, ఇంతకుముందేదో పాపంచేశావని దడిపించి హింసిస్తారు. పార్టీలో కళ్ళకి గంతలు కట్టేఆట ఒకటి ఆడగా అందులో స్టేన్లీ కింద పడటమేకాక కొంచెం అల్లరి చేస్తాడు. మర్నాడు జీవచ్ఛవంగా కనిపించే స్టేన్లీకి—ఎప్పుడూ షేవ్ సరిగ్గా చేసుకోనివాడు, సరయిన బట్టలు వేసుకోనివాడు— మంచి సూటువేసి అతన్ని తమ వెంట తీసుకుపోతారు గోల్డ్బర్గ్, మెక్కాన్లు. మధ్యవయస్కులయిన భార్యాభర్తల జీవితం ఎప్పటిలాగే భయంకరమయిన మాంద్యంతో సాగిపోయే ఒక దృశ్యంతో నాటకం ముగుస్తుంది. ఈ నాటకం రాసిన అతను హెరాల్డ్ పియింటర్. ఆధునిక ప్రపంచానికీ, దాని వాతావరణానికీ ఈ రకం నాటకాలే తగినవని అనిపిస్తుంది. సన్నివేశాలు కొన్ని నవ్వు పుట్టించేట్లు ఉన్నప్పటికి స్టేన్లీ లోనయ్యే హింస ప్రేక్షకు లందరిలోనూ ప్రతిధ్వనులని రేపుతుంది రచయిత నైపుణ్యం, నిజాయితీల పట్ల సందేహం లేనంతకాలం ఇటువంటి రచనలు తెలుగులోనూ మంచి 'ఆదరణ' పొందవచ్చు లేదా కనీసం బాగా ప్రచారంలోకి రావచ్చు. —ఆర్. జి

# అవీ...ఇవీ...

## గార్ముక్తేశ్వర్ మేళా

మీరట్కి 36 మైళ్ళదూరంలో గంగానది తీరాన ప్రతి సంవత్సరం జరిగే మేళని ఈయేడు 8 లక్షల మందికి పైగా యాత్రికులు సందర్శించడానికి దేశం నలుమూలల నుంచి వచ్చారు. యాత్రికుల సౌకర్యార్థం ఏర్పరచిన వసతులలో గమనించదగినది మైక్రోఫైన్డ్ ఆస్ప్రో తయారీ సంస్థ నికొలాస్ ఆఫ్ ఇండియావారు నెలకొల్పిన ఏస్ప్రో ప్రథమచికిత్స కేంద్రం. ఈ కేంద్రానికిదివరలో ప్రారంభోత్సవం చేసిన ఉత్తరప్రదేశ్ మంత్రి శ్రీ రామ్చంద్ర వికాల్ ఆస్ప్రో నికోలాస్వారి ప్రజాసేవని కొనియాడారు.

మేళా జరిగినన్ని రోజులూ ఆస్ప్రో కేంద్రం యాత్రికులకి అమూల్యమైన సేవను అందించింది. ఉచిత వైద్యసదుపాయం గురించిన బహుళ ప్రచారం జరిగింది. దాదాపు రెండువేల మందికి పైగా ఈ కేంద్రంలో చికిత్స పొందారు. ఈ కేంద్రాన్ని సందర్శించిన డాక్టర్ కె. కె. గోవిల్, డాక్టర్ జె. పి. బనాల్ ఆస్ప్రో నికోలాస్వారు యాత్రికుల ఆరోగ్యాన్ని గురించి చూపిన శ్రద్ధని మెచ్చుకున్నారు. (ఒ. వి.)

## అఖిలభారత బాలబాలికల సమావేశం

అఖిలభారత బాలబాలికల ఎనిమిదవ సమావేశం డిశంబరు 24 నుంచి 26వ తేదీ వరకు మూడు రోజుల పాటు లక్నోలో ఏర్పాటుచేస్తున్నారు. పిల్లలకి సంబంధించిన అన్నివిషయాలని సమగ్రంగా చర్చించడం ఈ సమావేశం యొక్క ప్రధానమైన ఉద్దేశం. 8 నుంచి 16 ఏళ్ల బాలబాలికలందరూ ఇందులో పాల్గొనడానికి యోగ్యులు. లక్నోలో వసతి ఏర్పాట్లు చేస్తారు. రైల్వే కన్సెషన్లు కూడా లభిస్తాయి. వివరాలకు: జగదీష్ గంధి, కన్వీనర్, ఆల్ ఇండియా చిల్డ్రన్స్ కాన్ఫరెన్స్, లక్నో, (యు. పి.) కి రాసి సంప్రదించాలి.

## తెలుగు రచయితల మహాసభలు

నాల్గవ అఖిలభారత తెలుగు రచయితల మహాసభలు మే ఆఖరివారములో గాని లేక జూన్ మొదటి వారములోగాని హైదరాబాదులో జరుపబడును దీనికి సంబంధించిన కార్యక్రమములు త్వరలో ఏర్పాటు చేయబడుచున్నవి.

మహాసభలకు ప్రతినిధులుగ చేరదలచుకున్న రచయితలు, సాహితీప్రియులు యీక్రింద సూచించినట్లు వారి విలాసములను వ్రాసి వివరములు పొందవచ్చును. పోతుకూచి సాంబశివరావు, ప్రధానకార్యదర్శి, అఖిలభారత తెలుగు రచయితల మహాసభలు 208, న్యూబోయిగూడ, సికింద్రాబాదు—3

—పోతుకూచి సాంబశివరావు, ప్రధాన కార్యదర్శి.

## బొంబాయి ఆంధ్రమహాసభ

ఇటీవల వార్షిక ఎన్నికలలో బొంబాయి ఆంధ్ర మహాసభకు ఈ క్రింది కార్యవర్గం ఎన్నుకోబడింది. అధ్యక్షులు: శ్రీ పి. శ్రీనివాసమూర్తి, ఉపాధ్యక్షులు: శ్రీ ఎ. రామారావు, కార్యదర్శి: శ్రీ పి. కృష్ణశర్మ, సహాయ కార్యదర్శులు: శ్రీ డి. మురళి, శ్రీ బి. జి. కె. మూర్తి, కోశాధికారి: శ్రీ ప్రయాగ, కార్యవర్గం: సర్వశ్రీ వి. శ్రీరాములు, పి. హనుమంతరావు, టి. కోటేశ్వరరావు, యమ్. వి. యన్. మూర్తి, ఈశ్వర ప్రసాద్, గోవిందాచారి, మోహనరావు, డి. శివరావు.

## దక్షిణ సరిహద్దు ఆంధ్ర భాషాసంఘం

సత్యవేడులోని దక్షిణ సరిహద్దు ఆంధ్ర భాషా సంఘం పంచమ వార్షికోత్సవం జరుపుకున్నది. సమితి అధ్యక్షులు సన్నాడి భాస్కరరెడ్డి అధ్యక్షత వహించారు. శాసనసభ్యులు శ్రీ కటారి మునుస్వామి గారు తదితర పుర ప్రముఖులు ఉపన్యసించి, సంఘం కార్యకలాపాలను ప్రశంసించారు. సంఘాధ్యక్షులు శ్రీ ఇ. వి. సుబ్రహ్మణ్యం సంఘం కార్యక్రమాన్ని విశదీకరించి ప్రజల సహకారాన్ని అభ్యర్థించారు. కార్యదర్శి వందన సమర్పణ చేశారు.



'నిజం చెప్పవద్దు' లో దేవిక ఎన్. టి. రామారావు.

శనివారం సరిగ్గా సాయంకాలం ఆరు గంటల సమయం. సురేష్ అధినేత రామా నాయుడు 7 వ ఫ్లోర్ బయట ఏకాంతంగా యేదో ఆలోచిస్తూ, తెల్లకాగితాన్ని మలుపు చేస్తూవుంటే నేను వెళ్లి 'గుడ్ ఈవినింగ్ సార్' అన్నా. 'రా, బాబూ, రా లోపలికి వెళ్లు; మంచి ఘట్టం జరుగుతూ వుంది' అన్నారు.

అది 'డెన్' సెట్టు. ముగ్గురు దొంగలు



[illegible]' లో జయలలిత.

విచారంగా పాప ఆరోగ్యంపట్ల ఆందోళన వ్యక్తం చేస్తూ ఉంటే పాప తల్లి డాక్టర్ని ముఖభావాల్ని తదేకంగా గమనిస్తూ వుండడం, డాక్టరు ఇంజక్షన్‌ను పాప శరీరంలో పొడవడం, పాపకు స్పృహ రావడం, పాప ప్రాణాన్ని కాపాడినందుకు డాక్టరుకు అందరూ థాంక్స్ చెప్పడంలో ఆ సన్ని వేశం అయిపోయింది ఈ సెట్టు డిసెంబరు 3 తేదినుండి 20 వరకు జరిగింది. ఇంత పెద్ద షెడ్యూలును వెయ్యడమే గొప్ప. అందులోనూ ఆర్టిస్టు లందరూ యిన్ని కాల్‌షీట్లు యిచ్చి సహకరించడం శ్రీ నాయుడు మంచి మనస్సుకు నిదర్శనం. పై సెట్టులో డాక్టరుగా శ్రీ జగ్గయ్య, అమ్మగా కుమారి దేవిక, దొంగలుగా త్యాగరాజు, సత్యనారాయణ, రామదాసు, పాపగా బేబి రాణి చక్కగా నటించారు శ్రీ టి వి. ఆర్ శేషగిరిరావు దర్శకత్వం, వెంకటరత్నం కెమరా కూడా యిందులో పాత్రధారులు. బ్రేక్ కావడంలో సెట్టు బయటికి వచ్చేశాను

షెడ్యూలుకి లక్ష

శ్రీ నాయుడు యిలా చెప్పడం ప్రారంభించారు 'ఈ సెట్టు పని కావడంతోనే గోల్కొండ ఫోర్టుకు మా యూనిట్ వెళ్తుంది. పదిరోజులపాటు అక్కడ షూటింగు జరుగుతుంది ఈ షెడ్యూలుకు లక్షరూపాయలు ఖర్చవుతుంది. అది అయిపోయిందంటే ప్యాచ్‌వర్కు మాత్రం మిగిలి వుంటుంది అన్నారు 'మరి గోల్కొండకు ఎప్పుడు ప్రయాణం?' అని అడిగాను. జనవరి ఫస్టుకి అన్నారు

కారు ట్రబుల్-నాలుగు టేకులు

విజయనుండి వాహినికేసి వస్తూవుంటే 'తిక్క శంకరయ్య' నిర్మాత శ్రీ డి వి. ఎస్. రాజా సెట్టులోకి ఆహ్వానించారు. సెట్టులో హెరాల్డ్ కారును శ్రీ రామారావు స్టార్టు చేస్తూ వుంటే, స్టడీ, స్టడీ అంటూ పద్మనాభం స్నాప్ కొట్టడం, దాన్ని చూస్తూ నాగయ్య, సూర్యకాంతం, జయలలిత నవ్వుతూ వుండడం—యీ సన్నివేశాన్ని శ్రీ యోగానంద్ చిత్రించారు. ఆర్టిస్టులందరూ చక్కగా నటించినా కారు ట్రబుల్ యిచ్చినందువల్ల నాల్గు టేకులు తియ్యాల్సి వచ్చింది.

**విరామంలో తమాషా**

శ్రీ ఎన్. టి. ఆర్. యీ చిత్రంలో కృష్ణ కుమారిని, జయలలితను (యిద్దర్నీ) వేర్వేరు వేషాల్లో ప్రేమిస్తారు, అన్నారు రాజాగారు అప్పుడే బజారునుండి సామాన్ పకోడీలు, స్వీట్స్ తేబడ్డాయి శ్రీ ఎన్ టి. ఆర్. అందరికీ తన చేతులమీదుగా ఒక్కొక్క పొట్లాన్ని యిచ్చి కొంతసేపు తమాషా కాలక్షేపంలో దిగారు

ప్రముఖ జ్యోతిశ్శాస్త్ర ప్రవీణుడు, హాస్యనటుడయిన శ్రీ రామచంద్రరావును చూచి శ్రీ రామారావు అన్నారు: 'ఏమిటయ్యా, రామచంద్రరావుగారూ, నిన్న ప్లేటు టిఫిన్ తిని, చెప్పండా వెళ్ళిపోయారేమిటీ, యిదేనా మర్యాద?' అని వేళాకోళంగా ఒక విసురు విసిరారు. సెట్టులో వున్నవాళ్ళందరూ గొల్లుమని నవ్వారు. ఇంతలో జూనియర్ సముద్రాల అక్కడికి వచ్చారు

'ఏమండీ, మీకు గేదె వుందని చెప్పడం వరకేనా? మాకేం యేనాడగా మీరు జున్ను పాలు పంపనేలేదే?' అన్నారు తమాషాగా దానికి సముద్రాల రామానుజం మా గేదెలు పాడి యివ్వడంలేదండీ అని సమాధానమిచ్చారు. శ్రీ రామారావు మమ్మల్నందర్నీ చూచి. 'చూశారా, ఎలా తప్పించుకుంటున్నారో?' అని సముద్రాల (జూనియర్)ను గేలి చేసారు

**'ఉత్కృష్టమైన దృశ్యాలెన్నో ఉన్నాయి'**

'చూడండి, నాగయ్యగారూ! గిరిజా కళ్యాణం చిత్రాన్ని యెవరయినా తీస్తే యెంత బాగుంటుంది ఇందులో శివతాండవం, ఈశ్వర తపోభంగం, మన్మథ సంహారం' గిరిజా కళ్యాణం, కుమారసంభవంలాంటి వుత్కృష్టమయిన దృశ్యాల్లో యెన్నో ఉన్నాయండీ' 'గిరిజాకళ్యాణం' సబ్జెక్టు పై శ్రీ ఎన్. టి ఆర్. కు యెంతటి మోజో వాళ్ళా, పీళ్ళా తియ్యడం దేనికండీ? మీరే యిలాంటి సాహసాన్ని చెయ్యాలి అన్నాను ఎందుకంటే శ్రీ రామారావుగారికి ప్రతి పుద్గ్రంథంలో మంచి 'స్టడీ' వుంది అదీగాక పౌరాణిక పాత్రలను పోషించడంలో శ్రీ ఎన్ టి ఆర్. కు పోటీ లేరు అనడం నిర్వివాదాంశం.

* * *



'పాలమనసులు' లో జమున

శ్రీ రామారావుతో యిక వస్తానండీ అని రాబోతుంటే 'చూడండి, యీ పరిశ్రమకు మీ కలంద్వారా కాస్త సహాయం చేసేందుకు ప్రయత్నించండి మీరు. మేము అంతా కలసి మన సినిమా పరిశ్రమ ముందంజ వేసేందుకు ప్రయత్నిద్దాం' అన్నారు

శ్రీ రామారావులో మంచితనం యెటువంటిదంటే 'నీవు బాగుపడు—వుండేవాళ్ళను బాగుపడనీ' అనే తత్వం.

**'అన్నీ మానేశాను'**

మాంసం, డ్రింక్ అన్నీ మానేశానండీ అన్నాడు ప్రభాకరరెడ్డి 'రణభేరి' సెట్టులో. అదేమిటీ వున్నట్టుండి యీ నిర్ణయం తీసుకున్నారు? అని ప్రశ్నించాను అవునండీ, యీమధ్య చాలా దెబ్బతిన్నానండీ మనస్సు బాగా వుండడంలేదు అనవసరంగా 20 వేల రొక్కం నాటకాల్లో పోగొట్టు

# సినిమా డైరీ

● శ్రీధర్ నిర్మిస్తున్న ఈస్ట్మన్ కలర్ తమిళ చిత్రంలో నాయికగా కుమారి కాంచన నటిస్తోంది పద్మశ్రీ శివాజీ గణేశన్ నాయకుడు

● శివాజీ గణేశన్‌కు జోడిగా కమలా పిక్చర్స్ నిర్మించే తమిళ చిత్రంలో వాణిశ్రీ నాయికగా నటించేందుకు నిర్ణయించబడింది వీరిద్దరూ కలిసి నటిస్తున్న మొదటిచిత్రం యిదే

● కుమారి రత్న (జోహరిబేగం) యొక్క వివాహం డిసెంబరు 15వ తేదీన షేక్ ఉమర్ నావజీర్‌తో బొంబాయిలోని "అశోకా అపార్టుమెంట్స్"లో వైభవంగా జరిగింది

● మాధవి పిక్చర్స్ నిర్మించే సాంఘిక చిత్రంలో శ్రీ అక్కినేని నాగేశ్వరరావును నాయకుడిగా బుక్ చేశారు శ్రీ కె ఎస్ ప్రకాశరావు దర్శకులు

● జెమినీ సంస్థ నిర్మించే "బహురాణీయాం" చిత్రంలో ఒక ప్రముఖ పాత్రను పోషించేందుకు శశికళను బుక్ చేశారు

● శ్రీఅనంతలక్ష్మి ప్రొడక్షన్స్ నిర్మించిన "కాంభోజరాజు కథ" డిసెంబరు 29 తేదీన విడుదలవుతుంది

● శ్రీ ఎస్ వి టి అండ్ రామకృష్ణా కంబైన్స్ హైదరాబాదులో నిర్మిస్తున్న స్టూడియో వచ్చే "ఉగాది"కి రెడీ అవుతుంది వీరి తదుపరి చిత్రనిర్మాణం ఆ శుభసమయంలోనే ప్రారంభమవుతుంది

● రాజేశ్వరీ కళ్యాణమండపంలో "యీ దేవ్" చిత్రనిర్మాత, దర్శకుడు, నటుడు అయిన శ్రీ సునీల్‌దత్‌కు శ్రీ ఎ ఎల్ శ్రీనివాసన్ సన్మానసభ నేర్పాటు చేశారు

● శ్రీ ఏ భీమ్‌సింగ్ దర్శకత్వం నిర్వహిస్తున్న "గౌరి" హిందీ చిత్రంలో శ్రీమతి నూతన్ గుడ్డి పిల్లగా నటిస్తోంది ఈ చిత్రాన్ని శివాజీ గణేశన్ నిర్మిస్తున్నారు

● వంజాలా సినీ సిండికేటువారి "నిలువు దోపిడీ" చిత్రంలో ప్రసాదర్ బుర్రకథ హైలైటు!

● ప్రముఖ హాస్యనటుడు శ్రీ చలం నిర్మిస్తున్న సాంఘిక చిత్రానికి శ్రీ కె విశ్వనాథ్‌ను దర్శకులుగా నియమించారు.

● సూర్య ఆర్ట్ పిక్చర్స్ అనే కొత్తసంస్థ 'పన్నీరు కన్నీరు' నిర్మిస్తున్నారు శ్యామ్‌టోన్ స్టూడియోలో ప్రారంభోత్సవం జరిగింది దర్శక నిర్మాత శ్రీ పిళ్లారిసెట్టి

కున్నాను అప్పటినుండి యేమి తినాలన్నా చెయ్యాలన్నా బుద్ధి పుట్టడంలేదు అన్నారు. 'రణభేరి'లో శ్రీ కాంతారావు, రామకృష్ణ, రాజబాబులకు తండ్రిగా నటిస్తున్నారు.

* * *

'గెట్ రెడీ' అన్నారు దర్శకులు మూర్త్యం. ఆర్టిస్టులందరూ టేక్‌కు సిద్ధమయ్యారు. ఈ చిత్రంలో కాంతారావు, రామకృష్ణ అన్నదమ్ములు వీళ్ల తల్లి నిర్మలకు పిచ్చి పుట్టి అయోమయంగా పిచ్చి పిచ్చిగా వాగుతూ వుంటుంది. ఆమె పరిస్థితిని

## సినిమా

చూచి కుమారులిద్దరూ భయపడుతూ వుంటారు.

'అన్నయ్యా! ఎవరికోసమయితే సువర్ణ మహాలను నిర్మించదల్చుకున్నానో, ఆ అన్నయ్యవు నీవేనా, నేనెంత పాపాత్మురాలను' అని ఏడుస్తూ 'అమ్మా, అమ్మా! నిన్ను యీ స్థితిలో చూడకముందే నా ప్రాణాలు పోయివుంటే ఎంత బావుండేదమ్మా' అని తిరిగి తన అన్నయ్య కాళ్లపై బడి 'క్షమించు, అన్నయ్యా' అనడంలో 'కట్' అన్నారు డైరెక్టరు మూర్త్యం. 'రణభేరి' చిత్రంలో యీ సన్నివేశం ప్రేక్షకుల మనస్సును కరిగించివేస్తుంది రాజశేఖరుడిగా కాంతారావు, చంద్రశేఖరుడిగా రామకృష్ణ, తల్లిగా నిర్మల, తండ్రిగా ప్రభాకరరెడ్డి నటించారు. శ్రీ పింజల సుబ్బారావు నిర్మించే యీ జానపద చిత్రంలో నాయికలు ముగ్గురు కుమారి రాజశ్రీ, వాణిశ్రీ, గీతాంజలి, రాజబాబు, మీనాకుమారి హాస్యజంట శ్రీ కోదండపాణి సంగీత దర్శకుడు. శ్రీ మహారథి సంభాషణలు యీ చిత్రాన్ని జనవరికి విడుదల చెయ్యాలనుకుంటున్నట్లు నిర్మాత వ్యక్తపర్చారు. కెమేరాను శ్రీ వేణు నిర్వహిస్తున్నారు. కథ: శ్రీ బొమ్మకంటి సుబ్బారావు.

* * *

'మేకప్ పీరాజా పిక్చర్ తీస్తున్నాడు, తెలుసా?' అన్నాడు రామకృష్ణ . ఏమిటీ, నిజమేనా? అని అడిగాను పీరాజాను. 'అవును, సార్ ఫిబ్రవరిలో ప్రారంభిస్తాను పీటూరి కథ వ్రాసారు శ్రీ దాసు డైరెక్టు చేస్తారు' సత్యం సంగీతాన్ని సమకూరుస్తారు. శ్రీ కాంతారావు, రామకృష్ణ, రాజనాల, ప్రభాకర రెడ్డి, రాజశ్రీ ముఖ్యపాత్రల్ని పోషిస్తారు' అని ముగించారు పీరాజా రండి, వెళాం అని పీరాజా తన మేకప్ రూంవద్దకు తీసి కెళ్లాడు మేకప్‌రూంలో కాంచన, జయంతి కూర్చుని పిచ్చాపాటీ చేస్తూవుంటే నేను వెళ్లి గుడ్ యీవినింగ్ అనడంలో వాళ్ల టాపిక్‌కు బ్రేక్ పడింది

* * *

'నా భర్తలతోనే చనువుగా ఉంటుంది'

'నా భర్తతోనే నీకు మాటలా' అన్నది కాంచన జయంతితో. 'అదేమిటమ్మా! మాకంతా చెప్పకుండా పెళ్లి చేసుకున్నావేమిటి?' అని ప్రశ్నించాను 'అయ్యో, అది కాదండి. ఈ జయంతిని చూడండీ, ప్రతి పిక్చర్‌లోనూ నా భర్తలతోనే చనువుగా వుంటూంది. యీమెను ఏం చెయ్యాలో చెప్పండి' అని అడిగింది 'ఆవిడ చెయ్యడం తప్పేనండి. క్షమించేందుకు వీల్లేదు. ఏదయినా కఠినశిక్ష వెయ్యండి' అన్నాను. ఇదంతా వాళ్ల నిజజీవితంలో జరిగేదికాదు సుమండీ కుమారి కాంచన, శ్రీమతి జయంతి తోడికోడళ్ళుగా మూడు చిత్రాలో



'ఋణానుబంధం'లో కృష్ణకుమారి, శోభన్ బాబు



'రణభేరి'లో రాజశ్రీ.

నటించారు. అవే జెమినీ సంస్థ నిర్మించిన 'భామావిజయం', 'భలే కోడళ్ళు', బహు రాణియాం.'

'సబ్జెక్టు మార్చుతున్నాం'

'అడుగుజాడలు', 'పట్టుకుంటే పది వేలు' చిత్రాలను నిర్మించిన శ్రీ సాంబశివ రావు, శ్రీ వందనం తమ మూడవ సాంఘిక చిత్రంయొక్క షూటింగును జనవరిలో ప్రారంభిస్తారని తెలిసి వారి ఆఫీసుకి వెళ్ళాను. నిర్మాత లిద్దరూ లోపలికి ఆహ్వా వించారు. 'ఏమి సాబ్, పిక్చర్ ఎప్పుడు స్టార్టు చేస్తున్నారు?'_ అని అడిగాను 'జనవరిలో' అనుకున్నామండీ. ఫైనలైజ్, చేసిన సబ్జెక్టును నిన్నరాత్రి చేసిన చర్చలో మానుకోదల్చుకుని వేరే కథను వెతుకు తున్నాం. కాబట్టి కాస్త ఆలస్యం కావచ్చు' అన్నారు. 'నటీ, నటు లెవరెవరుంటారు?' అని అడిగాను. 'కృష్ణకుమారి, రాజశ్రీలు తప్పకుండా వుంటారు. రాజబాబువుంటాడు. మిగతా తారాగణం యెన్నిక యింకా నాల్గు రోజుల్లో పూర్తిచేస్తాం. సంగీతం సారథి

శ్రీచలపతిరావు, ఛాయాదర్శకుడు శ్రీ వి. రామచంద్రరావు' అని చెప్పారు నిర్మాతలు.

బిజీ షెడ్యూల్స్

'మడిగుండాలు చిత్రాన్ని యీ షెడ్యూలులో పూర్తి చేసేస్తాను' అన్నారు. వాసూ స్టుడియోలో దర్శకులు శ్రీఆదుర్తి చక్రవర్తి సంస్థ నిర్మిస్తున్న 'మడిగుండాలు' యొక్క షూటింగు డిసెంబరు కు అయిపోతుంది జనవరిలో సెన్సారు అవుతుంది శ్రీ ఆదుర్తి సునీల్ దత్‌కు తమిళంలో విజయవంతంగా ప్రదర్శించబడిన 'కుమరిప్పెణ్' చిత్రాన్ని డైరెక్టు చేస్తున్నారు ఈ మధ్య డార్జిలింగ్‌లో ఒక పక్షంరోజులు షూటింగు జరిపి డిసెంబరు 3వ తేదీన మద్రాసుకు వచ్చారు. డిసెంబరు 4 నుండి వాసూ స్టుడియోలో ఇన్‌డోర్‌వర్కు ప్రారంభించారు.

'మీ 'విశాల నేత్రాలు' ఏమయిందండి?' అని అడిగాను. 'పై సంవత్సరం తప్పక తీస్తానండి రెండు హిందీ కాంట్రాక్టుల నంగీకరించాను. వాటి షూటింగు కాగానే 'విశాల నేత్రాలు' మీద నా దృష్టిని కేంద్రీకరింపచేస్తాను' అన్నారు ఆదుర్తి. 'ఎందుకండి మీరు ఆ కథపై అంత మోజు చూపిస్తున్నారు?' అని ప్రశ్నించాను 'ఇట్ యీజ్ ఎ వండర్‌ఫుల్ క్లాసిక్ అండ్ నాగేశ్వరరావు ట్యాలెంట్‌కు తగినరోల్ అందుకే' అన్నారు ఆదుర్తి. బిజీ షెడ్యూల్స్‌వల్ల శ్రీ ఆదుర్తి చాలా బలహీనంగా కన్పడ్డారు మనకున్న మినిమం గ్యారంటీ దర్శకుల్లో శ్రీ ఆదుర్తి ఒకరు





'ఉమ, చండీ, గౌరి శంకరుల కథ'లో బి. సరోజాదేవి.

అని 'పూలరంగడు' మరలా నిరూపించింది.

* * *

ఎంతోకాలంగా ప్రజలు యెదురు చూస్తూవున్న విప్లవ వీరుడు 'అల్లూరి సీతారామరాజు' చిత్రాన్ని శ్రీ ఎన్. టి. రామారావు, శ్రీ త్రివిక్రమరావులు హైదరాబాదులో వారు నిర్మిస్తున్న కొత్త స్టుడియోలో నిర్మిస్తామని యిటీవల శ్రీ ఎన్ టి. ఆర్ 'తిక్క శంకరయ్య' సెట్సులో వ్యక్తంచేసారు. 'అల్లూరి సీతారామరాజు'తోబాటు 'రామపట్టాభిషేకం', 'వరకట్నం' చిత్రాలను కూడా నిర్మిస్తాం అన్నారు ధీమాగా రామారావుగారు.

* * *

విజయ సంస్థకు శ్రీ కె వి. రెడ్డి 'ఉమ, చండీ, గౌరి శంకరుల' కథ చిత్రాన్ని డైరెక్టు చేస్తూవున్నారు ఈ నెలాఖరులో షూటింగు పూర్తవుతుంది. జనవరి రెండవవారంలో అంటే సంక్రాంతికి యీ చిత్రం విడుదలవుతుంది. శ్రీ కె వి. రెడ్డి పిక్చర్‌ను చూచి చాలాకాలం అయింది. అనుకునే ప్రేక్షకులకు ఈ చిత్రం చాలాకాలం వారి మనస్సుల్లో నిల్చిపోయేట్లు శ్రీ రెడ్డి కథను రక్తికట్టించారు శ్రీ రామారావు, సరోజాదేవి ముఖ్యపాత్రలను ధరించిన యీ చిత్రంయొక్క కథ, సంభాషణలను శ్రీ పింగళి నాగేంద్రరావు, సంగీతాన్ని శ్రీ పెండ్యాల నాగేశ్వరరావు నిర్వహించారు.



'పూలరంగడు'లో జమున

## నచ్చిన పాత్రలు

రాజ్యం పిక్చర్స్ నిర్మిస్తున్న సాంఘిక చిత్రంలో శ్రీ నాగేశ్వరరావు ద్విపాత్రాభినయం చేస్తున్నారు. రాజశ్రీతో ఒకరుగా, భారతితో మరొకరుగా రెండు విభిన్న మనస్తత్వాలు గల్గిన భూమికల్ని ధరిస్తున్నట్లు యీ పాత్రలు తనకు బాగా నచ్చినట్లు యిటీవల మద్రాసుకు వచ్చిన నాగేశ్వరరావు వెల్లడించారు. శ్రీమతి లక్ష్మిరాజ్యం, శ్రీ శ్రీధరరావు హైదరాబాదు సారథి స్టుడియోలో నిర్మిస్తున్న యీ చిత్రానికి శ్రీ సి ఎస్ రావు దర్శకులు శ్రీ ఘంటసాల సంగీత దర్శకుడు శ్రీ అక్కినేని, రాజశ్రీ, భారతి, గుమ్మడి, రేలంగి, సూర్యకాంతం, మకన్య ముఖ్య పాత్రల్ని పోషిస్తున్న యీ చిత్రంయొక్క షూటింగు షెడ్యూలు జనవరి 10 వ తేదీతో పూర్తవుతుంది అని దర్శకులు శ్రీ సి. ఎస్ రావ్ వెల్లడించారు. ఈ ఇద్దరు మిత్రులు తర్వాత శ్రీ అక్కినేని చిత్రాన్ని చమ్రియా విడుదల చేస్తారు ద్విపాత్రాభినయం చేస్తున్న చిత్రం యిదే

—శ్రీనివాస్



'జాల్' (హిందీచిత్రం)లో మాలాసిన్హా, విశ్వజిత్.

# జోలపాట

*సదానంద

నిదురపో నా చిట్టి!
నిదురపో నా పట్టి!
నిదుర పోయెను జగము
నిఖిల ప్రాణులతో_ జోజో!
పని చేసి మీ అమ్మ
బడలి పోయింది;
నిదురపోయే దాక
నిన్నూపమంది_ జోజో!
పగలంత చేసియును
పని పూర్తి కాలేదు_
ఆఫీసు ఫైళ్ళివిగో
ఇచట నున్నాయి_ జోజో!
కలిలోన తిండికే
కరువొచ్చెనమ్మ-
క్యూలోన నాకాలు
గుల్లాయెనమ్మ_ జోజో!
జీతమొచ్చిన నాడె
జేబు ఖాళీ ఆయె;
అప్పులిచ్చెడి వారు
అవనిలో లేరాయె
జోజో!
ఆకలేమో నీకు-
అది రివాజే మాకు_
ఏడుపే
కూడుగా
మిగిలింది
మనకు_
జో!
జో!

Sadananda

# పుస్తకాలు

## దిండు క్రింది పోకచెక్క

రచయిత— విశ్వనాథ సత్యనారాయణ. ప్రకాశకులు యం. శేషాచలం అండ్ కో., వెల రూ2—00

శాకయ్య అనే ఆంధ్ర బ్రాహ్మణుడు శాక్యసింహుడై, అనేకమంది స్త్రీలను వంచించి, తుదకు నేపాళ దేశానికి చేరుకోవడం, అక్కడ గోస్వామి అనే యువకుడు, శాకయ్య తాను వంచించిన స్త్రీల పాపాలను పాపామంద్వారా తీర్చుకొనేటట్లు చేయడం ఈ నవలలోని ఇతివృత్తం.

నేపాళదేశ చరిత్రకు సంబంధించి రచయిత వ్రాయ తలపెట్టిన నవలల్లో యిది మొదటిది. 'ఈ నవలాపాలలోనివి నేపాళరాజ వంశ చరిత్ర కథలు' అని రచయిత మున్నుడిలో పేర్కొన్నారు.

భారతయుద్ధకాలం నాటికి నేపాళదేశాన్ని జితేదాస్తి మహారాజా పరిపాలిస్తున్నాడు. ఆ సమయంలో శాక్యసింహుడు 'నేపాళదేశానికి వచ్చినట్లుగా నేపాళ రాజవంశచరిత్రలో వ్రాయబడింది.

మహాభారత యుద్ధం క్రీస్తుకు పూర్వం 3138 వ సంవత్సరంలో జరిగిందనే అభిప్రాయాన్ని రచయిత బలపరుస్తున్నారు. ఆ అభిప్రాయాన్ని అనుసరించి బుద్ధుడు భారతయుద్ధం తరువాత పన్నెండువందల సంవత్సరాలకు జన్మించాడు.

భారతయుద్ధం తరువాత మూడువేల పన్నెండు వందల సంవత్సరాలకు గాని జన్మించని శాక్యసింహుడు అనే పేరుగల బుద్ధుడు భారతయుద్ధకాలం నాటి జితేదాస్తి మహారాజుకు సమకాలీనుడు కావడం అసంభవం.

ఈ వైరుధ్యాన్ని పరిష్కరించడానికి గాను రచయిత ఈ నవలను రాశారు. 'బుద్ధునికు శాక్యసింహుడు అన్నపేరు లేదు' అని రచయిత అభిప్రాయం. బుద్ధునకు శాక్యసింహుడనే పేరు లేదు అనిగాని, జితేదాస్తి మహారాజుకు సమకాలీనుడైన శాక్యసింహుడు వేరొక శాక్యసింహుడనిగాని రచయిత యే ఆధారాన్ని పేర్కొనలేదు. కేవలం కల్పితకథలతో చరిత్రలోని వైరుధ్యాన్ని పరిష్కరించడానికి రచయిత ప్రయత్నించినారు.

శాకయ్య అనే ఆంధ్ర బ్రాహ్మణుడు శాకయ్యసింహుడై తరువాత శాక్యసింహుడై నేపాళదేశాన్ని చేరుకొన్నాడు. 'అయ్య' అనేది తెలుగు ప్రత్యయం. నవలలో తరువాత తన అభిప్రాయానికి అనువుగా మార్చుకొనేటందుకు వీలుగా రచయిత ఈ పేరును సృష్టించాడనే అనుమానం పాఠకులకు సాధారణంగా కలుగుతుంది. నవలలోని మిగిలిన యే తెలుగు వ్యక్తులకు కూడా ఈ 'అయ్య' ప్రత్యయం లేదు. శాకయ్య కుమారుల పేర్లు గిరిధరుడు, హరికిశోరుడు.

'శ్రీకృష్ణుడు నూటముప్పది యేండ్లు బ్రతికెను. ఒక్కొక్కడు వందయేండ్లుగ పదమూడు రాజులు వేయియేండ్లేలిరనగా విశ్వసించుటలేదని' రచయిత విశ్వాత్ములను, వారి జడబుద్ధులను చదివిన వారిని ఆక్షేపించినారు.

రచయిత చెప్పినట్లుగ ప్రతిరాజు నూటముప్ఫై సంవత్సరాలు జీవించినా కూడా పదమూడు రాజులు ఒక్కొక్కరు నూరు సంవత్సరాలు రాజ్యాన్ని పాలించడం సాధ్యం కాదు.

ఉదాహరణకు ఎ అనే రాజు నూటముప్ఫై సంవత్సరాలు జీవించాడు. అందులో నూరు సంవత్సరాలు రాజ్యాన్ని పరిపాలించాడు. అతనికి పాతిక, ముప్ఫై సంవత్సరాల వయస్సులో బి అనే కుమారుడు జన్మించాడు. ఎ తరువాత బి రాజ్యానికి వచ్చేసరికి అతని వయస్సు దరిదాపు నూరు సంవత్సరాలు ఉంటుంది. అందుచేత బి ముప్ఫై సంవత్సరాలకంటే యెక్కువ కాలం రాజ్యాన్ని పాలించలేడు. అలాగే బి కుమారుడు సి కూడా.

కథాకాలమునందు రచయిత అనేకంత ప్రచ్ఛన్న ప్రతాపించలేదు. జరాసంధుని మరణానంతరం శాకయ్య గిరివ్రజపురం ప్రవేశించి ప్రతాపసేనుని కలుసుకొన్నాడు. సింహపులు అజ్ఞాతవాసం చేయుటకి ముందుగానే శాకయ్య జితేదాస్తి మహారాజు వద్దకు వచ్చాడు. ఈ లోపున ప్రతాపసేనుడు 'పదునేను సంవత్సరముల క్రింద నిచట కొక దొంగవంటివాడు (శాకయ్య) వచ్చెను' అని గోస్వామితో చెప్పినాడు.

జరాసంధుని వధించిన వెంటనే సింహపులు రాజసూయయాగాన్ని చేసేరు. ఆ వెంటనే వారు వనవాసానికి వెళ్లారు. అందుచేత జరాసంధునివధకు అజ్ఞాతవాసానికి మధ్యకాలం పన్నెండు సంవత్సరాలమీద కొద్ది నెలలుండునది కాని యెట్టి పరిస్థితిలోనూ పదిహేను సంవత్సరాలు ఉండదు.

కథలో విచిత్రం ఉన్నా, లేకపోయినా, రచయిత తన అభిప్రాయాన్ని వెలిబుచ్చడానికి ఈ నవలను ఒకసాధనంగా వాడుకొన్నారు. ఉదా.— వర్ణాశ్రమన్ను, లజ, విష్ణువు.

కథయొక్క అంతం మత విశ్వాసాల మీద ఆధారపడింది కాబట్టి సత్యాసత్య విమర్శకు అవకాశంలేదు. మొత్తం మీద ఈ నవలలో చెప్పబడిన కథ భారత యుద్ధకాలంలోనే కాకుండా కొంచెం మార్పులతో యేకాలంలో జరిగడానికైనా అవకాశం ఉంది.

ముఖపత్రంమీద కల్పనాత్మకమైన చారిత్రక నవల అని రాశారు. ఇందులో కల్పన ఉందిగాని చరిత్ర యెక్కడా లేదు. ఇకముందు వచ్చే నవలల్లో చరిత్ర కూడా ఉంటుందని ఆశిద్దాం.

రచయితను గురించిగాని, శైలిని గురించిగాని రయడం ఆంధ్రులకు కృష్ణానదిని పరిచయం చేయడం వంటిదే కాగలదు. రచయిత సుప్రసిద్ధులు కాబట్టి ఈ నవలను విశేషంగా చూడవలసివచ్చింది, దానినే మరొకరు రాసినట్లుఅయితే అద్భుతంగా ఉందని చెప్పడానికి అభ్యంతరం లేదు.

—కొటిలక్ష్మి

## మధూక కుసుమాలు

(నవల: రచయిత: దేవరకొండ చిన కృష్ణశర్మ విశిప్రచురణ ప్రతులకు: దేశిబుక్ డిస్ట్రిబ్యూటర్సు, శరత్ బిల్డింగ్సు: విజయవాడ—2. పేజీలు:404., వెల: రూ. 6—00.)

మధూకం మహారుమహాలవధం. అర్థం ఇప్పచెట్టు. మధూక కుసుమాలు అంటే ఇప్పపూలు అనే అర్థం వెంటనే స్ఫురించకపోవచ్చు. ప్రసిద్ధంగా తెలిసే ఇప్ప పూలకు సంస్కృతీకరణచేసి నవలకు నామదేయం తీర్చినట్లే, పాత్రలనూ సంఘటనలనూ రచయిత చాలావరకు సంస్కృతీకరించటం పాఠకులు గమనిస్తారు.

అట్టమీదబొమ్మ కథాత్మను పట్టిసుదు. కథా ప్రారంభానికి మాత్రమే చిత్రీకరణ. అట్టమీద చిత్రంచూచి పాఠకులు ఊహించిందానికి భిన్నంగా వుంటుంది నవల. ముఖలమ్మ ముఖంలో, వాతావరణంలో 'అనుమానం' స్ఫురించకుండా చిత్రించవలసింది.

ఈ నవల పాతికేళ్ళపూర్వం ప్రచురించబడి వుంటే బాగుండేది. కథాకాలం ప్రస్తుతంకాదు. కథ, వని వేశాలు, పాత్రలు వర్తమానివావికావు. గతానివి. పతానివే అయినా, వాస్తవాలు కాగాలేవు. అయినా ముద్రలో అచ్చమైన కల్పితాలు.

మూడో తరగతి తెలుగు సాంఘిక చిత్రాలలో కథానాయకుడితో అన్ని అందాలా పోలిక ఉన్నవాడు రామూ ఉరఫ్ రామచంద్రమూర్తి. చిన్ననాటు అతని మెళ్లో వ్రేలాడుతూఉన్న 'రామచంద్రమూర్తి' బొమ్మప్రయోజనం కథాంతంలో రచయితకే గుర్తురాలేదు.

ఈ నవలలో దేవతలవంటి మనుష్యులు, రాక్షసుల వంటి మనుష్యులు ఉన్నారుగాని మనుష్యుల వంటి మనుష్యులు తీరుతారాదేవి తప్ప.

రచయితకు పాండిత్యం ఉంది. లోకానుభవం వుంది. రచనలో నేర్పువుంది. అయితే అనవాజీవి వృత్తంలో అవి అర్థవంతాలు కాలేక పోయాయి.

రచయిత మతంమీద నక్రమమైన అభిప్రాయం ఉందనుకోవచ్చు. బ్రాహ్మణాధిక్యం మీద నమ్మకంవుంది. వాటిని నవలలో సరయిన పద్ధతిలో స్థాపించలేదు.

నవలలో కథైక్యం కొరవడింది. అనేకసంఘటనలు తొలగించుకొన్నా బాగుండేది. పాత్రలు అధికం వర్ణనలు అధికం. ఉపన్యాసాలు అధికం సంభాషణల కోకొల్లలు.

అంత అమాయకత అసహజం కాకపోతే మరుపు రానిపాత్ర నాగన్నశాస్త్రి.

బలమైన కథను స్వీకరిస్తే, ప్రచారధోరణి తగ్గించుకొంటే రచయిత మరింత ఉత్తమరచనలు అందించే అవకాశం ఉంది.

ఏమైనా పాఠకులను ఆద్యంతం చదివించే నేర్పు ఉన్నరచన ఈనవల.

—మనోరాణి

# పుస్తకాలు

## శ్రీమతి పవని నిర్మలప్రభావతి నవలా సాహిత్యము

ఉదయకిరణాలు— క్రౌన్ ఆక్టేవో సైజు 240 పేజీలు. వెల: రు. 5/- శలభాలు: 218 పేజీలు. వెల: రు. 4/50. ప్రచురణ: బృందావన్ పబ్లిషింగ్ హౌస్, మారిస్‌పేట, తెనాలి.

మానవ జీవితం ఒక మహాకావ్యం. జీవితంలోని వివిధ సంఘటనలే నవరసభరిత ఘట్టాలు. ఇవే రచనలకు పునాదులు. ఆ వాస్తవిక సంఘటనలలో కొన్ని నమ్మశక్యం కానంత అసహజంగా ఉంటాయి. ఇటువంటిదే మీనాక్షి మనుగడ.

కథానాయిక మీనాక్షి క్లిష్టపరిస్థితిలో పుట్టింది. గడ్డు వాతావరణంలో పెరిగింది. మెట్టినింట కాస్త సుఖమనిపించినా, మళ్ళీ కష్టాలూ సమస్యలూ ఎదుర్కొనక తప్పలేదు. — ఇదీ కథా వృత్తం.

తిరుపతి కొండ ఎక్కుతున్న మీనాక్షి పాదాలు అడుగులు వేస్తూనే వున్నాయి. ఆమె గోవిందనామ సంకీర్తనం చేస్తూనే వుంది. కాని, మనస్సు మాత్రం గత జీవిత ఘట్టాలను నెమరు వేస్తోంది.

ఇక అసలు కథ— మీనాక్షి జీవిత గాథ పూర్తి కావటం, ఆమె పాదాలు ఆ యేడుకొండలవాడి సన్నిధి చేరటం ఒకేమాటు జరుగుతాయి. నవల పేరు 'ఉదయ కిరణాలు.' అయినా ఇందులో అస్తమించిన పాత్రలే ఎక్కువ.

మీనాక్షి తండ్రి విశ్వనాథం. భర్త శ్రీనివాసరావు. ఇద్దరి తత్వాలూ ఇంచుమించు ఒకేలాగ నడుస్తాయి. ఉభయులూ తాగుడుకు అలవాటు పడినవాళ్ళు, రెండవ పెళ్లి చేసుకున్నవాళ్ళు, నిలకడ మీద పశ్చాత్తప్తులయినవాళ్ళు. ఈ పోలికలతో ఇద్దరూ సన్నిహితులవుతున్నారు.

యాతనలు పడే భార్యలూ, చెడి పడిపోయిన భర్తలూ ఈ నవలలో ముఖ్యంగా తారసపడతారు.

రచయిత్రి కథలతో పరిచయమున్న మనకు ఈ నవలలో ఒక చిన్న పునరుక్తి కానవస్తుంది. లోగడ 'నమ్మండి— మానండి' అనే కథను చదివాక 202వ పేజీలో ప్రారంభమయ్యే శర్మ వృత్తాంతం చర్వితచర్వణమా అనిపిస్తుంది. ఒకసారి కథారూపంలో వచ్చిన ఘట్టం మళ్ళీ ఈ నవలలో ఒక భాగంగా రావడమెందుకా అని..?

రెండవ నవల— శలభాలు:

ఈడు వచ్చిన పిల్ల సరస్వతి వలపు వలలో పడకుండా పక్కింటి పిన్నిగారు పార్వతమ్మ కాపాడుతుంది. సరస్వతిలో మార్పు తీసుకురావటానికి శ్యామల జీవితగాథను ఆదర్శంగా చెబుతుంది.

సరస్వతి లాగానే శ్యామల భాస్కర్ అనే యువకుణ్ణి ప్రేమించి, గోతిలో పడింది. శ్యామలకు తోడు మీనాక్షి మరొక శలభం సంఘానికి ఆహుతి అయింది.

జీవితం దేవుడిచ్చిన వరమే. అలాగని వడ్డించిన విస్తరి కాదు. అందులో అగాధమైన లోయలూ, సహారాలూ, ఎన్నో ఎన్నో ఆకర్షణలతో నిండి, మానవుణ్ణి అధఃపాతాళానికి తొక్కటానికి చూస్తుంటాయి. అప్రమత్తతతో పరిస్థితుల్ని ఎదుర్కొనగలిగినవారే జీవితాన్ని ఫలప్రదం చేసుకోగలరు. అర్థవంతంగా జీవించగలరు. ముందు వెనకలు ఆలోచించక గుడ్డిగా ప్రయత్నించే వారంతా చివరికి అగ్గిలో దూకిన శలభాల్లాగ ఆహుతి అవుతారు.

ఉడుకు నెత్తుటి ఆవేశంతో విచక్షణ జ్ఞానం లేక అడ్డదారులు పట్టే యువతీ యువకులు తమకు తెలియకుండానే జీవితాలను ఏ విధంగా నాశనం చేసుకుంటున్నారో చెప్పటం ఈ నవల ఉద్దేశం. శ్యామలా, మీనాక్షి ఇందులో మనకి పరిచయమయ్యే రెండు శలభాలు.

ఈ కథనం ద్వారా సరస్వతిలో తగిన మార్పు తీసుకురాగలుగుతుంది పార్వతమ్మ. సరస్వతిని ఒక ఇంటిదాన్ని చేసి సంతోషిస్తుంది. ఆ సంతోషం తను విజయం సాధించినందుకు కాదు, ఒక శలభం లాగా సరస్వతి కూడా నశించిపోయే ప్రమాదాన్ని తప్పించగలిగినందుకు.

సాంఘిక ప్రయోజనాన్ని ఆశించి శ్రీమతి ప్రభావతి ఈ నవలను రచించారు. అయితే— 'సంఘం ఇలా ఉండకూడదు' అని చెప్పే ఉద్దేశంతో సంఘం కుళ్ళును ఉన్నది ఉన్నట్టు బయట పెట్టడం జరిగింది. వాస్తవికత కొన్ని పట్ల అందవిస్తుంది. కాని, ఈ రచనలో అది ఎంతవరకు ప్రయోజనాన్ని సాధించగలుగుతున్నది అని ప్రశ్న.

దిగజారిపోయిన వ్యక్తికి సంఘంలో విలువ లేదు. అటువంటి వ్యక్తి ఏమయినా సంఘం పట్టించుకోదు. బాగున్నప్పుడు స్వప్రయోజనానికి ఉపయోగించుకున్నా, అనాథప్రేత అయినప్పుడు ఎవరు చేరదీసుకుంటారు — అలాగే, నీచంగా బతుకుతున్న శ్యామలను చావుబతుకుల మధ్య వదిలేసి మళ్ళీ బతికించి, మళ్ళీ మరింత హీనంగా కుళ్ళి కుళ్ళి బాధపడేలా చంపటం అవసరమా?

ఈ నవలలు రెండూ చదివిన తరవాత—

బతుకు భయం

పతన మయం

అనే సూత్రం అచ్చు గుద్దినట్లు మనస్సుకి పట్టిపోతుందనటం నిజం.

—శివకుమారి


Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street. Madras-1. Chief Editor: S. Sambhu Prasad.